**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938 1972]

శుక్రవారం : 15-5-'81

దుర్మతినామ సం. వైశాఖ శు. ద్వాదశి

**సంపుటము 74 : సంచిక 35**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60

ఆరు మాసాల చందా రు. 33-80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


# విషయానుక్రమణిక

# నెస్టమ్ శిశువు జీర్ణానికి మంచిది






మీ పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుంచి నెస్టమ్ బేబీ సిరియల్ రైస్ ఇవ్వండి. ఇందులో 11 విటమిన్లు, ఇనుము సమృద్ధిగా ఉన్నాయి.

బియ్యం నుంచి తయారయిన సీరియల్ జీర్ణం చేసుకోడానికి సులభమయినది.

నెస్టమ్ ప్రయోజనాలు అనేకం పాలతో నెస్టమ్ యివ్వడం ప్రారంభించండి: పాప పెరుగుతూ వుంటే, ఆహారంలో నెస్టమ్ ఉడకబెట్టిన పండ్లు, పండిన మరియు మెత్తగా చేసిన కాయగూరలు, పప్పులతో పలురకాలుగా ప్రవేశపెట్టండి.

## నెస్టమ్®
### బేబీ సీరియల్ రైస్




తయారు చేయడం సులభం



ముందుగ మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్టమ్ చేర్చండి కలపండి



తినిపించుటకు తయారు

SAA/FSL/N/1863 TEL

ఊరగాయల కాలం వచ్చేసింది
ఊరగాయలన్నింటికి 'అగ్‌మార్క్'

**A.S బ్రాండ్ పప్పునూనె**
**మాన్షన్ బ్రాండ్ నువ్వులనూనె**
లనే వాడండి.

★ 70 సంవత్సరాలనుండి మహిళాలోకం విశ్వాసాన్ని చూరగొన్నది............

★ సంవత్సరం అంతా ఘుమఘుమ లాడుతూ ముక్కని మెత్తబడనీయకుండా ఊరగాయని రుచికరంగా వుంచుతుంది..........

★ అన్నివంటలకు శ్రేష్ఠమైనది.








తయారుచేయువారు: **అంబటి సుబ్బన్న & కో.** సామర్లకోట

TWINKLERS

---

## తల వెంట్రుకలు రాలుటకు కారణము పేలు

పేలను, ఈరులను నశింపజేయుటకు కెంజ్ వాడండి. సువాసనతోకూడిన పేలనాశిని కెంజ్ హెయిర్ ఆయిల్‌ను వాడి మీ కేశములను కాపాడుకొనండి.



**కెంజ్**

పేలనాశిని మందు

దీనిలో ఈరులను నశింపజేయు బెన్‌జోకెయిన్ ఉన్నది










ఫార్మ్ ప్రోడక్ట్స్ ప్రయివేట్ లిమిటెడ్
'ఫెమ్' మెడికల్ కాలేజ్ రోడ్,
తంజావూరు-613 007 తమిళనాడు

వ్యాపార వివరములకు వ్రాయండి.

INN/PPN/114 TEL




## ముఖ చిత్రం

24.4.81 తేది 'రతి' ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక కోటి సూర్య కాంతులతో వెలిగిపోతూ మమ్మల్ని ఆహ్లాద కరమైన ఆనంద లోకాలకు లాక్కుపోయింది. తెలుగు తెరపై దేదీప్యమానంగా వెలుగుతున్న తార "రతి" వినీలాకాశమందలి తారలను సైతం తలదన్నే విధంగా వుంది. ఆ అందాల రాశి వాల్చూపులతో హృదయాలను గిలిగింతలు పెడుతూ యువతరాన్ని అల్లరి చేస్తూంది. ఇంత అందమైన ముఖచిత్రం వేసినందుకు కృతజ్ఞతాభివందనలు.

మటికాన ప్రకాష్ ( విజయనగరం )

* * *

10.4.81 ఉగాది సంచిక పై టి.వి.ఎస్. మూర్తి రంగుల చిత్రం 'వసంత విలాసం' మాకెంతో నచ్చింది.

ఇంద్ర సింహాసనం సీరియల్ ఆరంభంలోనే ఆకట్టుకున్నది. కన్నేపల్లి కామేశ్వరి చెక్‌మేట్ ముగింపు బావుంది.

వ్చ్! ఉగాది! కవిత హైలైట్!

వై. వసంతకుమార్, షేక్ సుబాని ( మెదక్ )

* *

ఉగాది సంచిక 'వసంత విలాసం' కవర్ పేజీ చాలా ఆకర్షణీయంగా ఉంది. కథలు బావున్నవి. కార్టూన్లు నవ్వు వచ్చేవిగా లేవు.

విష్ణుకుమార్ ( మైసూరు)

## కథలు

17.4.81వతేదీతో వెలువడిన శోభన్ బాబు జయసుధల ముఖ చిత్రంగా ఉన్న పత్రిక ఆకర్షణీయంగా ఉంది. కథలలో "ముందడుగో ముళ్ల కంపో" "అందని ఆశాకుసుమం" బాగున్నాయి. స్పేస్ షటిల్ తుది పరీక్షల వివరాలు విజ్ఞానదాయకంగా ఉన్నాయి. 'దాదా'ల దేశం కవిత సమాజంలోని దవుర్జన్యాలకు, అన్యాయాలకు చక్కటి దర్పణం వంటిది. ఈ వారం ఎక్కువ పేజీలు సినిమాకే కేటాయించారు. ఇది మరీ దారుణం. పెమ్మెత్స సూరిబాబు ( ఖమ్మం )

* * *

వీక్లీలో శ్రీ కేతినేడిగారు కథలకు వేస్తున్న బొమ్మలు చాలా బాగావుంటున్నాయి. కాని రచయిత(త్రి)ల పేర్లు, శీర్షికల పేరు చాలా గజిబిజిగా వ్రాస్తున్నారు. ఉగాది సంచికలో " వూరు వచ్చి పోయింది" అనే కథకు వ్రాసిన హెడ్డింగ్ విషయానుక్రమణిక" చూస్తేనే గాని అర్థం కాలేదు. కె. సీతారామయ్య ( గుంతకల్లు )

## లోకం పోకడ * డిరి మెన్

ఆదాయపు పన్ను అధికారులా? రండి రండి, నేనెన్ని బేరర్ బాండ్లు కొన్నానో లెక్క వేసుకోండి.

పాకిస్తాన్ మంచిదేశం. శ్రీమతి గాంధీగారూ, పాక్‌కి అమెరికా ఆయుధాల అవసరం

మా జాతీయతా బిల్లు న్యాయమైనదీ, సరియైనదీ అని మీరు విశ్వసించాలి

మా జాగ్వార్ విమానాలు అమృతమైనవి.

మంచిది. వెళ్లిరండి

శ్రీమతి థాచర్ గారూ! మీరు సమయాన్ని చాలా వృథా చేసుకున్నారు

అవసరమైతే నిత్యావసర వస్తువుల దిగుమతి జరుగుతుందంటున్నారు. వెంకట్రామన్ గారు

మంచిది అప్పుడైనా మనం కొన్ని వస్తువులని దాచేయవచ్చు

అక్రమ నిల్వదారు

అక్రమ లాభార్జన పరుడు

బ్రిటిష్ జాతీయతా బిల్లులో ఫాసిస్టు ధోరణులు.

ప్రపంచ ప్రజలారా రక్షించండి! రక్షించండి!

మానవతా హక్కులు

OOMMEN

# సీరియల్

# ఇంద్రసింహాసనం

## సి. ఆనందారామం

(గత సంచిక తరువాయి)

యువకులంతా జయంతుడివైపు ఆకర్షితులు కాసాగారు. అతి త్వరలోనే భూలోకంలోని యువకులకు, ఇంద్రవక్షపాతులకు నాయకుడయిపోయాడు జయంతుడు.

మరుద్గణాలు లోలోపల ఇంద్రుడికి వ్యతిరేకం. ఇంద్రుడు వారిని సంహరించాలని చూసాడు. కాని వారిని చంపటం అతనివల్ల కాలేదు. అంతటి బలవంతులు ప్రతిపక్షంలో వుండటం తనకు మేలు కాదని వారిని తన పాలకవర్గంలో చేర్చుకున్నాడు ఇంద్రుడు. పదవికోరి ఇంద్రుడి పాలకవర్గంలో ఉన్నా లోలోపల ఇంద్రుణ్ని వ్యతిరేకిస్తుంది ఆ గణం. ఇంద్రకుమారుడు జయంతుడు ఈ రకంగా భూలోకంలో పలుకుబడి సంపాదించుకోవటం వారు సహించలేకపోయారు. నహుషుణ్ని చేరి "ఇంద్రా! జయంతుడు భూలోకంలో మలయమారుత విమానాలు నిర్మిస్తాడట! విశ్వకర్మనే భూలోకానికి పిలిపిస్తాడట!" అని చెప్పారు.

నహుషుడు వెంటనే విశ్వకర్మను పిలిపించి "భూలోకంలో జయంతుడు నిర్మించబోతున్న మలయమారుత విమానాలకు నువ్వు సహకరించటానికి వీల్లేదు" అని ఆజ్ఞాపించాడు. జయంతుడు వింతగా ఆహ్వానించినా, నహుషుడికి భయపడి విశ్వకర్మ రాలేదు. జయంతుడు తానొక్కడూ విమానాలను నిర్మించలేకపోయాడు. మలయమారుత విమానాల నిర్మాణం తాత్కాలికంగా ఆగిపోయింది. ఇది చాలామందిలో అసంతృప్తిని కలిగించకపోలేదు కానీ, నారదుడి భవిష్యద్వాణి ... దేవేంద్రకుమారుడన్న నిశ్చయం— భూలోకవాసులలో జయంతుడి గౌరవం నిలిపాయి.

**12**

శుక్రాచార్యుడు దానవులకు గురువుగా పనిచేస్తున్నప్పుడు అతడు ప్రత్యేకంగా అరణ్యాలలోకి పోయి ఆశ్రమంలో వుంటాడు. కానీ, మిగిలిన సమయాలలో తన దివ్యభవనంలో వుంటాడు. ఆ భవనం కూడా మయుడు నిర్మించిందే! వృషపర్వుడు శుక్రాచార్యుడికి రాజ్యంలో తన కంటె ఎక్కువ గౌరవవైభోగాలు కలిగిస్తాడు. మయుడు వృషపర్వుడికి అద్భుతమైన సభ నిర్మించి ఇచ్చాడు. అతడి ఆజ్ఞననుసరించే శుక్రాచార్యులకు కూడా ఒక అపూర్వభవనం నిర్మించాడు. ఆ భవనంలో కళాసంపద కళ్ళకు మిరుమిట్లు గొలుపుతూ వుంటుంది. ఏటుచూసినా గోడలలో ప్రతిబింబాలు కనిపిస్తూ అదొక అద్భుత ప్రపంచంలా ఉంటుంది. క్రీడా సరోవరాలతో, క్రీడా శైలాలతో అందమైన వుద్యానవనం ఉంది. గృహప్రాంగణంలో జలధారలు పైకెగజిమ్మే యంత్రాలున్నాయి. పైకెగసే ఆ ధారలలో చిత్రవర్ణాలు ప్రతిఫలిస్తూ వింతచూసినా అనితరసాధ్యమైన సౌందర్యాన్ని సృష్టిస్తున్నాయి.

ఆ ఇంటిముంగిటికి వచ్చిన ఇంద్రాణి ఇది బ్రాహ్మణుని ఇల్లేనా? అని ఆశ్చర్యపోయింది. బృహస్పతికి మించిన వైభోగాలకోసమే కదా, శుక్రుడు రాక్షసులను చేరింది!

పరిచారికలు ఇంద్రాణిని సగౌరవంగా లోపలికి తీసుకుపోయారు. ఆ సమయానికి దేవయాని కోపంతో మండిపడుతూ, చేతిలో ఒక బెత్తం పుచ్చుకొని ఒక పరిచారిక చేత గుంజిళ్ళు తీయిస్తోంది. ఇంద్రాణి రాకను కూడా గమనించలేదు. నమస్కరించలేదు. ఇంద్రాణి తానే దేవయానిని పలకరిస్తూ "దేవయానీ! నీ అమ్మమ్మను వచ్చాను గుర్తించావా ?" అంది.

చేతిలో బెత్తం కిందపడేసి ఇంద్రాణివైపు తిరిగింది దేవయాని. ఆమెకు ఇటుదేవతలన్నా, అటు రాక్షసులన్నా, చులకనభావమే రాక్షసులకు భయపడేవారని దేవతలపట్ల చులకన భావం! తన తండ్రి దయమీద ఆధారపడ్డ వారని రాక్షసులపట్ల చులకనభావం. మొత్తం మీద అందరికంటే తానేఎక్కువ. నిర్లక్ష్యంగా ఇంద్రాణికి నమస్కారంచేసి "కూర్చోండి!" అంది ఆసనంచూపి. చేతిలో బెత్తం పక్కకు పడేసింది. కానీ, ఆ పరిచారిక దేవయానిపట్ల భయంతో అలాగే చెవులు చేతులతో పట్టుకు కూర్చొంది.

"ఏ అపరాధానికి అలాదండిస్తున్నావు ?" లాలనగా అడిగింది ఇంద్రాణి. దేవయాని

**జరిగినకథ – 5 :** వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించుకొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడిపెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చుననేభావం ఆమెకు ఆనందం కల్గిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలు సహించలేక సప్తఋషులు అతన్ని పదవీచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుణ్ని నియమిస్తారు. ఆతన్ని ఏలాగయినా దింపేసి మళ్ళీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తుంటుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి, అగ్ని, వాయు, వరుణ, నిర్రుతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్లు ప్రవర్తిస్తాడు. యయాతీ, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు. తనకు అనుకూలుడైన వాడిని యముడి స్థానంలోఉంచి, తన కొడుకును నిర్దోషిగా నిర్ణయించేటట్లు చేస్తాడు నహుషుడు. దీనిని ముల్లోకాల ప్రజలందరూ ప్రతిఘటించడంతో జయంతుణ్నికూడా విడుదలచేయక తప్పలేదు. జయంతుడు భూలోకంలో విమానాల తయారీకి పూనుకొంటాడు.

"దానినే చెప్పమనండి" అంది. పరిచారిక మాట్లాడలేదు. "చెప్పు!" అని గద్దించింది దేవయాని. అది గడగడ లాడుతూ తడబడుతున్న గొంతుతో "రాకుమారి శర్మిష్ఠ నగరం విడిచిపోయిన తర్వాత, నగరంలో కళాకాంతులు లేవు" అన్నాను అంది. ఇంద్రాణి వింతగా "అంత చిన్న అపరాధానికా శిక్షిస్తున్నావు ?" అని అడిగింది.

దేవయాని కనుబొమలు ముడిపడ్డాయి. ఏమాత్రం సంకోచం లేకుండా నిర్మొహ మాటంగా "నా అహాన్ని ఎవరైనా గాయ పరిస్తే, నేను సహించను. నేను నగరంలో ఉండగానే, శర్మిష్ఠ లేనంతమాత్రాన కళా కాంతులు లేవంటుందా ? శర్మిష్ఠ కంటె నేనంత తీసిపోయానా ?" అంది.

దేవయాని నిజంగా అందమైనదే ! కానీ, ఆ అందం భయపెడుతూ ఆకర్షించే అందం. తన దరిదాపులకు ఎవ్వరికీ చేరనివ్వని అందం!

చిన్నతనం నుండీ దేవయానీ, శర్మిష్ఠలు కలిసిమెలిసి పెరిగారు. శర్మిష్ఠ ఆర్ద్ర ప్రవృత్తీ— అభిమానపూరితమైన అంతరంగమూ ఆమెను అందరకూ ఆప్తులను చేసేవి. అవి భరించ లేకపోయేది దేవయాని. ఎప్పుడూ తాను శర్మిష్ఠ కంటె అధికురాలనని నిరూపించు కోవటానికి ఆరాటపడుతుండేది దేవయాని. ఆమెను ఎవ్వరూ అభిమానించేవారుకాదుకానీ, శుక్రాచార్యుడిపట్ల గల గౌరవంతో ఆమెకు భయపడేవారు. ఆ కారణంవల్ల దేవయాని మనసు మరింత కఠినమయిపోయి అధికారం తోనే తన ఆధిక్యతను నిలుపుకొనేది. అంత రాంతరాలలో శర్మిష్ఠ ఔన్నత్యం దేవయానికీ తెలుసు. అందుకే శర్మిష్ఠ పట్ల అంతులేని ఈర్ష్య.

"తల్లిప్రేమకు దూరమయిన బిడ్డ— మమత అనుభవించకపోవటంచేత ఇలా తయారయింది" అనుకొంది ఇంద్రాణి

"నీ పరిచారికలందరినీ దూరంగా పంపెయ్యి- నీతో అత్యవసర విషయం ఒకటి మాట్లాడాలని వచ్చాను" అంది.

దేవయాని పరిచారికలను పంపేసింది.

"నీ తండ్రి తపస్సుకు వెళ్లారట కదా ?"

"అవును !"

"నహుషుడు - అదే ఇప్పుడు ఇంద్రపదవిలో వున్నవాడు. అతడి తపస్సు భగ్నంచెయ్యటానికి మేనకను పంపాడు."

"ఇంద్రుడికంతకంటె పనేముంది ?"

గతుక్కుమంది ఇంద్రాణి. ఈ పెంకిపిల్ల అనేమాటల్లో నిజం లేకపోలేదు మరి !

"అవుననుకో! కానీ, నువ్వు ఈ విషయం చెప్పి నీ తండ్రిని హెచ్చరిస్తే మంచిది కదూ !"

"నా తండ్రి తపస్సు ఎవరూ భగ్నం చెయ్యలేరు. కన్నకూతుర్నే ఆ పనికి నియోగించిన, మీకు ఆ విషయం తెలుసు ! నేను హెచ్చరించవలసిన అవసరంలేదు." దేవయాని కళ్లలో రోషం !



"అవును! శుక్రాచార్యులకేమీ భయం లేదు. అయినా ఎందుకయినా మంచిది, ఇటు మేనకనూ, అటు నీ తండ్రినీ కాపాడిన దానవవుతావు. ఒక్కసారి నీ తండ్రిని హెచ్చరించు!"

ఈ మాటలు వింటూనే వికాలున నవ్వింది దేవయాని - వెక్కిరింపుగా "ఏమిటి? మేనకను కాపాడాలా? ఒక మునితో కొంత కాలంగడిపితే, మేనక నష్టపోయేది ఏముంది? అప్సరసలకు ఇది మామూలే కదా!" అంది.

ఇంద్రాణి తన కోపాన్ని అణచుకొంది.

"దేవయానీ! ఈ మేనక, నా కొడుకు జయంతుణ్ణి ప్రేమించింది."

"అంతేకద! మునుల దగ్గరకు వెళ్తూ వస్తూ వుంటుంది. మధ్యలో తీరిక దొరికినప్పుడు జయంతుణ్ణి ప్రేమిస్తూ ఉంటుంది. వీళ్ళ కథలన్నీ ఇంతేగా! వీళ్ళకి శీలమేమిటి?"

"దేవయానీ!" నిగ్రహాన్ని కోల్పోయి తీక్ష్ణంగా అడ్డు తగిలింది ఇంద్రాణి.

## ఇంద్రసింహాసనం

"స్త్రీవయి కూడా సాటి స్త్రీ పట్ల సానుభూతి చూపకపోగా ఇలా నిరసిస్తున్నావు. శీలమంటే కేవలం శరీరాన్ని ఆశ్రయించుకొని ఉంటుందని అనుకొంటున్నావా? ఒకరిని ప్రేమించి, మరొకరితో సంసారం చేస్తున్నప్పుడు, ఈ మేనక కంటే ఎంత అధమురాలవో నీకర్థమవుతుంది."

"అమ్మా!" భయంతో, కోపంతో ఆమె వాక్ప్రవాహానికి అడ్డు తగిలింది దేవయాని.

ఇంద్రాణి శాంతించింది.

"దేవయానీ! స్త్రీలను స్త్రీలే అవమానిస్తున్నారు. స్త్రీల దుర్గతికి స్త్రీలే కారకులవుతున్నారు. అందుకే సృష్ట్యాదినుండీ స్త్రీ తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోలేకపోతోంది. పురుషుడిచేతి కీలుబొమ్మగా ఉండిపోవలసి వస్తోంది. ఏమయినా... నాకు సాధ్యమయినంతవరకూ స్త్రీజాతి విముక్తి కోసం పాటుపడతాను నీబోటివారు అడ్డు తగలకపోతే, నా ధ్యేయం మరింత త్వరగా ఫలిస్తుంది."

ఇంద్రాణి శుక్రాచార్యుల భవనం వదిలి తపోవన ప్రాంతాలకు పోతోంటే "అమ్మా! నమస్కారం" అన్న మధురమైన ధ్వని ఆమెను ఆపింది. ఎదురుగా దేవకన్య, రాక్షస లోకంలో దేవకన్యను చూసి వెంటనే గుర్తించలేక, నిదానంగా గుర్తించి "నువ్వా, హేమా! బాగున్నావా?" అని పలకరించింది.

### మిథ్యాస్వర్గం

ఆలోచన ఆకాశమైతే
ఆచరణ పాతాళమైతే
దోపిడీయే సామ్యవాదం
నరకమే స్వర్గం.

### యుగధర్మం

ఆంధ్రదేశంలో
రమీజాబీ
ఉత్తరప్రదేశ్‌లో
మాయాత్యాగి
ఒరిస్సాలో
బబ్బీరాణీల
రాక్షస రీతిలో మానవ భక్షణ
రక్షకులే భక్షకులైతే
దుష్టరక్షణ శిష్టశిక్షణ
యుగధర్మం

— టి. ఎల్. కాంతారావు

హేమ పరమానందంతో "మీన్నాళ్ళకు నా వాళ్ళను చూసాను? ఈ రాజ్యంలోకి మీ రెందుకు ప్రవేశించారమ్మా! ప్రమాదం కదా!" అంది.

"అవును ప్రమాదమే! కానీ, నా విమానంమీద వచ్చాను. ఏ క్షణంలోనయినా శత్రువులకందకుండా ఎగిరిపోగలను. కానీ, ప్రమాదానికి సహితం సిద్ధపడి సాధించవలసిన కార్యమొకటి వచ్చింది."

"అదేమిటో చెప్పండి."

"మా జయంతుణ్ణి ప్రేమించిన మేనకను నహుషుడు ఈ లోకానికి బలవంతాన పంపించాడు."

"దేనికి?"

"శుక్రాచార్యుల తపస్సు భగ్నం చెయ్యటానికి!"

"పాత కథ!"

"నిజమే! కానీ, ఇప్పటికయినా, కొత్త కథ ప్రారంభించాలని నా సంకల్పం. శుక్రాచార్యులను ముందుగానే హెచ్చరించగలిగితే, మేనక ఈ ప్రమాదం నుండి బయటపడుతుంది."

"కానీ, శుక్రాచార్యుల తపస్సు ఫలిస్తే, దేవతలకు ఆపద కదా!"

"పిచ్చిదానా! ఈ దేవదానవ యుద్ధం ఈనాటిదా? ఎప్పటికైనా దేవతలే కదా స్వర్గంలో నిలిచేది!"

"అమ్మా! దేవతలైనా, తమ దివ్యత్వం నిలుపుకొంటున్నారా?"

"అక్కడేకదా, ఈ సమస్య అంతా! దివ్యత్వం సాధించిన వారంతా, అది నిలుపుకొంటే సృష్టిలో ఈ ద్వంద్వాలే ఉండేవి కావు. లోకాలన్నీ ఆనందస్వరూపాలుగా మారిపోయేవి."

"ఈ దృష్టితోచూస్తే నిరంతర సాధకుడు మానవుని మనుగడే మేలేమో!"

"అవును. స్వర్గంలో అనుభవమే కాని, సాధనకు అవకాశంలేదు. ఈ అనుభవంలో సాధించిన ఔన్నత్యం క్షీణించిపోతే, మళ్ళీ ప్రాథమిక దశకు చేరుకోవలసిందే!"

"నేను నా భర్తనహుషుడికి చెప్తాను. అతడు శుక్రాచార్యులను హెచ్చరిస్తాడు. కానీ దీనివల్ల మీకేమీ ఆపదరాదు కదా, కాస్త ఆలోచించుకోండి!"

ఇంద్రాణి నవ్వింది. ఆ నవ్వులో ఆమె ఆత్మవిశ్వాసమంతా ప్రతిఫలించింది.

"నాకు న్యాయమని తోచింది నేను

# వేడి మీ శక్తిని పిండి పిప్పిచేస్తున్నప్పుడు...




# గ్లూకోన్-డి® తీసుకోండి

**అదనపు శక్తి కోసం—అలా మీకు కావలసినప్పుడల్లా.**

అలసట కలిగించడంలో వేడిని మించిందిలేదు. అలా వేడి వాతావరణంలో పనిచేస్తున్నప్పుడు అలసట, దాంతో పాటే నీరసం వచ్చేస్తుంది. అప్పుడే మీకు కావాలి ఉత్సాహాన్నిచ్చే, చల్లదనాన్నిచ్చే గ్లూకోన్-డి. అది మీకు అదనపు శక్తిని ఇస్తుంది. అలా మీకు కావలసినప్పుడు.

గ్లూకోన్-డి, లక్షలాది మంది 30 ఏళ్ళుగా విశ్వసిస్తూ వస్తున్న గ్లూకోజ్-డికి కొత్త పేరు. పళ్ళరసం, పాలు, టీ, కాఫీ, నీళ్ళు—దేనిలోనైన అలా దాన్ని కలుపుకు తాగండి లేక దేనితో కలపకుండా అలాగే తాగండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

గ్లూకోన్-డి మీ కుటుంబంలో నివారందరి కోసం. పనుల్లోనూ, ఆటల్లోను వారికి చురుకుదనం కోసం. గ్లూకోన్-డి—అందరికీ పరిచయమున్న అదే పచ్చ ప్యాక్‌లో వస్తుంది.




**విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్‌తో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడర్—గ్లాక్సో సమర్పణ**

HTB-GLL-6737-TG

# ఇంద్రసింహాసనం

వదలను. ఎవరికీ భయపడను. ఏ ఆపదలనైనా ఎదుర్కోగలను."

హేమ మనసు గౌరవంతో నిండిపోయింది. ముల్లోకాలలోనూ ఇలా మాట్లాడగలిగిన వారెవరూ? ఎవరో నిర్దేశించిన మార్గం గుడ్డిగా అనుసరించడం తప్ప తనకు తానుగా న్యాయాన్యాయాలు నిర్ణయించుకొనేవారెందరు? సుఖాలూ, భోగాలూ, ఆనందాలూ, అనుభవించాలని ఉబలాటపడేవారే తప్ప ఆపదలను ఎదుర్కోవటానికి సిద్ధపడేవారెందరు? దేనికీ భయపడని మనో నిబ్బరం ఎందరికి? ఆత్మ స్థైర్యంతోనే ఇంద్రుడు నహుషుడైనా, తాను ఇంద్రాణిగానే నిలిచింది. ఏ ఇంద్రుడికీ అందని త్రైలోక్య రాణిగా వెలుగుతోంది.

మయుడు దానవుల శిల్పి. అతడి శిల్పకళా ప్రావీణ్యం విశ్వకర్మ ప్రావీణ్యాన్నికూడా మించి కనిపించటంతో, అతడిని వశపరచుకొని తనలో చేర్చమని దేవతలు హేమను పంపారు. కానీ, హేమ విశ్వకర్మను నిజంగానే ప్రేమించి రాక్షసలోకంలో ఉండిపోయింది. అప్పుడప్పుడు దేవలోకం వెళ్ళాలని కోరిక కలుగుతుంది కానీ, నిగ్రహించుకొంటుంది.

హేమ మయుడికి చెప్పింది మేనక విషయం — మయుడు వెంటనే తపోవనానికి బయలుదేరాడు. నగరానికి చాలా దూరంలో అరణ్య మధ్యన వుంది తపోవనం. అక్కడ మునులు చాలా మంది పర్ణశాలలు నిర్మించుకొని, కఠిన తపశ్చర్యలో మునిగి ఉంటారు. కొందరు కుటుంబీకులు కూడా ఉంటారు కాని, ఆ మునిపల్లె వేరుగా ఉంటుంది. అరణ్య మధ్యన తపస్సు చేసే వారంతా బ్రహ్మచర్యం అవలంబించేవారే! సడలని నిగ్రహంతో పరమ గాంభీర్య మూర్తులైన ఆ మునులను క్రూరజంతువులు కూడా ఏమీ చెయ్యలేవు. ఆ ఆశ్రమ వాతావరణమే ఒక విధమయిన అయస్కాంత శక్తితో నిండిఉన్నట్లు ఉంటుంది. అక్కడ మృగాలు కూడా ఒకదాని నొకటి హింసించుకోవు. పాము—ముంగిస, ఏనుగు—సింహము అన్నీ కలిసి మెలిసి తిరుగుతాయి. ఆ పరిసర వాతావరణమంతా, ఆ మహామునుల ఆత్మ శక్తికి వశమై ఉన్నదా అన్నట్లుగా ఉంటుంది.

జన సంచారం లేని ఆ మహారణ్యమధ్యానికి అప్పుడప్పుడు కొందరు మునిపత్నులు, ముని కన్యలు వస్తూ ఉంటారు. తపశ్చర్యలో ఉన్న

తమ వారిని దర్శించి, నమస్కరించి పోతూ వుంటారు అరణ్యమే తమ ఇల్లుగా అలవాటు పడిన ఆటవిక యువతులు గుంపులుగాతిరుగు తుంటారు వీరిలో కలిసిపోయి, ఇంద్రుడు పంపిన దేవకన్యలు తిరుగుతుంటారు. మునుల తపస్సు భగ్నం చేయటానికివచ్చిన దేవకన్యలు మొదటే తమ ఉద్దేశాన్ని బయట పెట్టరు. అలా ప్రవర్తిస్తే మునుల ఆత్మశక్తి ముందు ఓడిపోవలసి వస్తుంది. సాధారణ ఆటవిక స్త్రీలలాగ మునులకు పరిచర్యలు చేస్తూ వారికి సన్నిహితు లవుతారు. ఆ తరువాత, ఆ మునులకీ తెలియనంత చతురతతో వారి మనసు తమవైపు ఆకర్షించుకొంటారు. ఆ రకంగా వారి ఆత్మశక్తి నాశనం చేసి తమ లోకానికి వెళ్ళిపోతారు.

మయుడు వచ్చేసరికి శుక్రాచార్యులు తపో దీక్షలో ఉన్నారు. నమస్కరించి దూరంగా కూచున్నాడతడు సాయంసంధ్యా సమయానికి సంధ్యా కృత్యాల నిర్వహణకి ఆయన కళ్ళు తెరిచారు. అప్పుడు మయుడు ఆయన పాదాలకు నమస్కరించాడు. శుక్రాచార్యులు ఆశీర్వదించి వచ్చినపని అడిగారు. ఎందుకంటే, మిగిలిన వారిలాగ మయుడు, కేవలం దర్శనార్థం రాడు.

మయుడు నమస్కరించి "ఆచార్యా! నహుషుడు మేనకను తమ తపోభంగానికి పంపాడు. ఆ విషయం హెచ్చరించటానికి వచ్చాను!'' అన్నాడు.

శుక్రాచార్యులు చిరునవ్వు నవ్వాడు.

మయుడు నమస్కరించి వెళ్ళిపోయాడు.

కీకారణ్యంలో చెట్ల ఆకుల సందునుండి పడుతున్న వెన్నెలరేఖలు దివినుండి భువికి జారుతున్న ఉయ్యాలలలాగ వున్నాయి. సాధుజంతువులు నిశ్చింతగా ఆశ్రమప్రాంతాన నిద్రిస్తున్నాయి.

క్రూరజంతువులు ఆశ్రమ ప్రాంతాలకు రాకుండా దూరదూరాన వేటాడుతున్నాయి. ఎక్కడో కొండకొమ్మనుండి క్రిందకు పడుతోన్న జలధారల శబ్దం. ఆ ప్రశాంత నిశీధిలో ఏదో మధురగానం...అలలు అలలుగా పరిసరాలను కమ్ముకుంటూ, తన మాధుర్యంతో ఆ వాతావరణాన్ని ముంచెత్తుతున్న గానం — శుక్రాచార్యులు కళ్ళు తెరిచాడు. అప్పుడప్పుడు ఆటవిక యువతులు భర్త రాకకోసం ఎదురు చూస్తూ ఏదోపాడుకోవటం మామూలయినా, ఈ పాట చాలా విలక్షణంగా ఉంది. మయుడి హెచ్చరికవల్ల ఆయన పరిసరాలను పరిశీలించి చూసారు. పర్ణశాలకు సమీపంలో వెన్నెల కిరణాలమధ్య చెట్టునానుకొని పాడుతోన్న మేనక కనిపించింది. తీక్ష్ణదృష్టితో మేనకను చూసారు. ఆమె గొంతులోపాట గొంతులోనే ఆగిపోయింది. ఎవరో తరుముతున్నట్లుపోయి నహుషుడి ముందు నిలిచింది.

గడగడలాడుతూ నిలిచిన మేనకనుచూసి నహుషుడికి జాలికిబదులు మరింత కోపం కలిగింది

"ఇంతవరకూ ఏ అప్సరసా, ఇంతత్వరలో తిరిగిరాలేదు. నువ్వు ఇంతత్వరలో తిరిగి వచ్చావంటే, అసలు ప్రయత్నం చెయ్యలేదన్న మాట!'' అన్నాడు.

మేనక చేతులు జోడించి, "లేదు దేవేంద్రా! నేనింకా నా ప్రయత్నం ప్రారంభించకుండానే, శుక్రుడు నన్ను తీక్షణంగా చూసాడు — అంతే! ఏం జరుగుతుందో, అర్థమయ్యేలోగానే నేను ఇక్కడ ఉన్నాను.''

"నాకు తెలుసు. ఇదంతా నువ్వూ జయంతుడూ, కలిసి ఆడుతున్న నాటకం. నీకు ఎలా బుద్ధి చెప్పాలో నాకు తెలుసు. నా పని సాధించటానికి ప్రయత్నించని నువ్వు అప్సరసగా ఉండటానికి వీల్లేదు. నిన్ను ఘంటాకర్ణుడికి అమ్మేస్తాను.''

ఘంటాకర్ణుడికి ... ఆ భయంకర పిశాచినికి... "అమ్మా..."అని ఆక్రోశిస్తూ ఇంద్రాణి పాదాలమీద వాలింది మేనక. జరిగిన దంతా తెలుసుకొంది ఇంద్రాణి. మేనక అప్సరసగా ఉన్నంతవరకూ, ఆమెను తానే విధంగానూ కాపాడలేదు. స్వర్గంలో అప్సరస లకు స్వతంత్ర వ్యక్తిత్వం ఉండటానికివీల్లేదు.

అతి త్వరలో ఆమె తన కర్తవ్యాన్ని నిర్ణయించుకొంది. మేనకకు తన భవనంలో ఆశ్రయమిచ్చింది. దేవకన్యలద్వారా కబురంపి భూలోకంలోని జయంతుణ్ణి రావించింది.

"జయంతా! నువ్వు నిజంగా మేనకను వివాహం చేసుకొంటావా?'' అని ప్రశ్నించింది.

"తప్పకుండా చేసుకొంటాను. మీ అనుమతి కోసమే, ఇంతవరకూ నేను సాహసించలేదు'' అన్నాడు.

ఇంద్రాణి తానే స్వయంగా బృహస్పతి భవనానికి వెళ్ళింది. అతడికి నమస్కరించి తన సంకల్పం తెలియపరచింది. బృహస్పతి నివ్వెరపోయి అప్సరసతో వివాహం తగదని నచ్చచెప్పబోయాడు.

"మేనక మనసు నేను అర్థం చేసుకొన్నాను. మేనకా జయంతులకు పరస్పరంగల ప్రేమానురాగాలు కూడా అర్థం చేసుకొన్నాను. ఈ వివాహంలో అనౌచిత్యమేదీ కాదు.'' అంది ఇంద్రాణి. బృహస్పతి ఒప్పు కోకతప్పలేదు. స్వర్గంలో ఈ రకమైన వివాహాలు చాలా అరుదు. శాశ్వత బంధాలు కోరేవారూ అరుదు. బృహస్పతి ఆధ్వర్యంలో మేనకా జయంతులకు వైభవంగా వివాహం జరిగింది. ఇంద్రాణి మేనకను ఆశీర్వదిస్తూ "నువ్విప్పుడు అప్సరసవికావు. జయంతుడి భార్యవి. ఈనాటినుంచీ, నహుషుడికి నీపైన ఏ అధికారమూలేదు'' అంది. అప్పటికి మేనక తలెత్తి సగర్వంగా స్వర్గాన్ని చూసింది.

"ఒక అప్సరసను—ఇంద్రాణి తన కోడలిగా చేసుకొంది. అప్సరసవృత్తిలోని నైచ్యంనుంచి

(62 వ పేజీ చూడండి)



# ఫాలాక్షుని డైరీ

## చింతచచ్చినా...!

డేనిష్ దేశస్థుడు స్టైన్ హెగ్లర్ అనే వో మేధావి పురుషులలో వయస్సు పెరిగిన కొద్దీ కామోద్రేకం పెరుగుతుందనీ, 90 ఏళ్ళు పైబడిన వారిలో యీ కామం చాలా హెచ్చు స్థితిలో ఉంటుందనీ, వారిలో కామోద్రేకమేగాక, శక్తి కూడా ఉంటుందనీ అన్నారట. ఆయన సుమారు 1162 మంది వయోవృద్ధులను యీ సందర్భంగా ఇంటర్వ్యూ చేశారట. తమకు పునః వివాహేచ్ఛ కలుగుతోందనీ, కాకపోతే కనీసం స్త్రీ పొందు అయినా కావాలని దేహమూ, మనస్సు కోరుతోందనీ, అయితే తమ పిల్లలో, చుట్టాలో, పక్కాలో తమ కోర్కెలను యీసడించుకోవడం వల్ల అతి కష్టంగా అట్టి కోర్కెలను అణుచుకోవలసి వస్తోందనీ అన్నారట. వారు తామూ వయస్సులో పెళ్ళి చేసుకుంటే తమ పిల్లలకేం నష్టం అన్నారట.

## నీటి పరుపు !

అమెరికాలో 'వాటర్ బెడ్' వుపయోగించడమో ఫ్యాషన్ అయి పోయిందట. పరుపు సైజులో వున్న సంచీలోకి నీళ్ళు ఎక్కించి ఆ నీటి పరుపు మీద పడుకుంటారట. అలాటి నీటి పరుపులు ప్రత్యేకంగా తయారు చేసే కంపెనీలు వెలిశాయట. ఇలాటి నీటి పరుపుల మీద పడుకుంటే శరీరంలోని ఉష్ణం తగ్గుతుందని, ఒళ్ళు నొప్పులు, మలబద్ధకం, కడుపునొప్పి వంటివి కూడా తగ్గుతాయని ఆ కంపెనీలు ప్రకటిస్తున్నాయట.

## అమెరికాలో బృందావనం !

యునైటెడ్ స్టేట్స్‌లో పిట్స్‌బర్గ్‌కు నూరు కిలో మీటర్ల దూరంలో సుమారు మూడు వేల ఎకరాల స్థలంలో హరికృష్ణ సొసైటీ వారు అత్యద్భుతమైన బృందావనాన్ని 50 లక్షల పౌనుల ఖరీదుతో కట్టారట. ఇంటర్నేషనల్ సొసైటీ అఫ్ కృష్ణా కాంషస్‌నెస్ (ఇస్కాన్) సంస్థ అధినేత శ్రీలోర్హాండి అధ్వర్యంలో యీ నిర్మాణం జరిగిందట. ఈ ఇస్కానులో చాలా గొప్ప గొప్పవారు మెంబర్స్‌గా వున్నారట. ఇట్టి వారు సుమారు 2600 మంది యావజ్జీవ సభ్యులున్నారట. క్వీన్ ఎలిజబెత్, మారిషస్ ప్రధాని సర్ శివ్‌సాగర్ రామ్‌గులామ్, బ్రిటిష్ ప్రధాని మార్గరెట్ థాచర్ వంటివారు ఆ ఇస్కాను వేడుకలలో పాల్గొంటున్నారట కూడా.

## కోర్టుకెక్కిన ఏడు నెలల పసివాడు !

బ్రెజిల్‌కు చెందిన బెలో హారిజనేట్ అనే వూరిలో వో రిపోర్టు నాధారం చేసుకుని ఏడు నెలల పసి పిల్లాడు అలెగ్జాండ్రా కన్‌బ్రాను కోర్టులో హాజరు పరచాలని అతని తల్లిని ఆదేశించారట. పోలీసులు. ఇంతకూ ఆ పిల్లవాని ఏడుపువల్ల తమకు నిద్ర పట్టటం లేదని చుట్టు పక్కల వారు కేసులు పెట్టారట. ఈ విచారణలో ఆ పిల్లవాని తల్లి నిర్మైడ్ తన కొడుకు అసలు ఏడవనే ఏడవడనీ స్నానం తొట్టిలో ఆడుకుంటూంటే అందులోంచి లేవదీసినపుడు మారాంగా ఏడుస్తాడంతేననీ కోర్టులో విన్నవించిందట.




## అఘాయిత్యపు మొగుడు !

మార్సెల్స్‌కు చెందిన పియరీ జాక్సన్ అనే ఆయన టి.వి. లోని వో నాటకంలో నటించిన నటి బిర్నాడెట్ లేఫంట్ సోయగాన్ని, ఒంపు సొంపులనీ, ఎత్తు పల్లాలనూ చూసి పిచ్చెత్తి నట్టయి, తన భార్య అంతకాపోయినా కనీసం అందంగా కూడా లేనందుకు, ఒంపు సొంపులు లేక రండోలులా వున్నందుకు ఆవేశంతో ఆమె జుట్టు దొరక బుచ్చుకుని నాలుగు బాది వీధిలోకి తోసేసి పిస్టలు తీసుకుని బెడ్‌రూము గోడమీద ఆవేశం తగ్గేవరకూ, ఆ పిస్టలులో గుళ్ళయి పోయేవరకు కాల్చేశాడట— వోరి పూర్ ఫెలో!

## కోర్టుకెక్కిన ముద్దు !

ప్రిన్స్ ఛార్లెస్ భారతదేశం వచ్చి బొంబాయి స్టుడియోలు చూడబోయినపుడాయనకు భారతీయ సత్ సాంప్రదాయ పద్ధతిలో స్వాగతం ఏర్పాటు చేసిన సందర్భంలో సినిమా నటి పద్మిని కొల్హాపూరు ఎగిరి ముద్దునా యువరాజుకు వో ముద్దివ్వడం ద్వారా భారతీయ సత్ సంప్రదాయాన్ని, భారతీయ స్త్రీ నిర్వచనాన్ని మంటగలిపిందని మీరట్‌కు చెందిన అన్వార్ అహ్మద్ అనే ఆయన దావావేసి, పద్మినీ కొల్హాపూరు భారతీయ శిక్షాస్మృతి 292, 294 సెక్షన్ల ప్రకారం శిక్షార్హురాలని విన్నవించాడట.

## అనుమానం తెచ్చిన తంటా !

డెల్సాస్‌లో 32 ఏళ్ల జేమ్స్ బ్రాడ్డా అనే వివాహితుడు తన శుక్లం పల్చబడుతోందన్న అనుమానంతో వో ఆసుపత్రికి వెళితే అక్కడి డాక్టర్లు అతన్ని పడుకోబెట్టి జామ్మని కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేసి పంపేశారట. దాంతో ఆ జేమ్స్‌కు తిక్కరేగి ఆ ఆసుపత్రి మీద రెండు లక్షల పౌనులు నష్ట పరిహారానికి దావా వేసేసరికి డాక్టర్లు కాళ్ళబేరానికి వచ్చి లక్షన్నర పౌనులకు సెటిల్ చేసుకున్నారట.

## 'మందు' చర్చ !

మొరార్జీ దేశాయ్ తాను పదవిలో ఉన్నప్పుడు భారత దేశమంతా మద్య నిషేధాన్ని అమలుకు తెచ్చి తీర్తానని పదేపదే ఉద్ఘాటించేవారనీ, అయితేయీ మద్య నిషేధం ఆయన అనుయాయులల్లోగానీ, జనతా ముఖ్య వ్యక్తులలోగానీ కనీసం అమలు జరుగ లేదని జనతా ముఖ్య వ్యక్తులలో ఒకరైన డాక్టర్ సుబ్రహ్మణ్యస్వామి అన్నారట. మొరార్జీ యీ మద్య నిషేధాన్ని పునరుద్ఘాటించినాటి రాత్రి వో జనతా మంత్రి పత్నిమణి నిజ గృహంలో పెక్కు జనతా మంత్రివర్యులు అతి చక్కని మద్యపానాల మధ్య యీ మద్యనిషేధం ముచ్చటించుకుని, ఆయన మూత్రపానం మానిన్నాడి విషయములో ఆలోచించ వచ్చునని అనుకున్నారట.

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి :

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్-RIN. 35-2316 Te

# వారఫలం

## 15-5-1981 శుక్రవారం మొదలు 21-5-1981 గురువారం వరకు

మేషం:— గోచార గ్రహాలు అనుకూలస్థానము లందున్నవి. వ్యాపార విస్తరణకు అనువైన వారం. మాట మంచితనం చేత, మేధాబలం చేత కొన్ని కార్యాలు సుముఖంగా నెరవేర్చగలుగుతారు. మన వారు, పరాయి వారను వివక్షతో మెలగండి. స్త్రీలకు : క్రీడారంగంలో, రాజకీయ వ్యవహార పరంగా మేలైన వారం.

వృషభం:— 'అదృష్ట జాతకులు మీరు' అనియనిపించే సంఘటన ఏదో జరుగనున్నది. గృహ విస్తరణకు కావలసిన ధనం, వస్తు సామగ్రి అందిపుచ్చుకొన్నట్లు సమకూడనున్నది. వ్యాపార వ్యవహారాలకు ఏ మాత్రం లోటు కనిపించదు. దైవ కార్యాలు నెరవేరుతాయి. స్త్రీలకు :సర్వాను కూల ప్రదమైన వారం.

మిథునం:— ఆరోగ్యంలో లోపం ఏర్పడు తుంది. జాగ్రత్త. అధికోష్ణత వలన బాధ పడ వలసి రావచ్చు. వయసు మీరిన వారు మరీ జాగ్రత్త వహించటం ఎంతైనా న్యాయం. డబ్బు అందక పోవటం, వస్తువులు ఏవైనా పోగొట్టుకో గలరు కూడా. స్త్రీలకు : విద్యావైజ్ఞానిక సంబంధంగా అనుకూలం. డబ్బు చేతికందే అవకాశంగల వారం.

కర్కాటకం: — వ్యవహార రంగాన ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. లాభం గడించే నిమిత్తం దూర ప్రయాణం చేయనున్నారు. విద్యా వైజ్ఞానిక రంగాలందు అనుకూలతగలదు. అనుకున్నశుభ కార్యం కలిసి రాకపోవచ్చు. ముఖ్య బంధువులతో వివాదానికి త్రోవ తీయగలవారం. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు లాభించే మార్గ మున్నది. ధనలబ్ధి గల వారం.

సింహం:— సులువుగా తలంచిన కార్యం జరిగే మార్గం లేదు. విరోధి వర్గీయులు తలలెత్తే అవకాశమున్నది. ఒక్క దినంలో ముగిసిపోతుం దనుకొన్న వ్యవహారం వారం రోజుల పాటు సాగు తుంది. అయినా ఫలితం శూన్యం. స్త్రీలకు: వ్యాపార వ్యవహారాదులందు, క్రీడా రంగమందు, రాజకీయరంగాన విశిష్టమైన మార్పు రానున్నది. గ్రహించండి.

కన్య:— ఏ పనీ సానుకూలంగాక పోవటం, ఏ వ్యవహారం తెమలక పోవటం, ఉద్యోగమందు ఆశించిన ఫలితం అందక పోవటం, వృత్తి నిరాటంకంగా సాగకపోవటం, బంధువర్గీయులతో తగాదాలు రావటం, ధనం అందక పోవటం గమ నించ గలరు. స్త్రీలకు :ఏ రంగంలో కూడా ఆశించిన ఫలితం లేక పోగా అధిక వ్యయసూచిత దినాలుగా భావించాలి.

తుల:— ఎవరేమనుకున్నా, కృషి చేస్తే అను కున్న ఫలితం, విద్యా వైజ్ఞానిక, ఉద్యోగ వృత్తు లందు అందుకోగలరు. సర్వరంగాలలో మీకు అనుకూలత, ఆదాయం. అభివృద్ధి, అధికారుల ఆదరణ, ఆప్యాయత, అనుభూతి సంభవం. స్త్రీలకు : రాజకీయంగా , క్రీడారంగ పరంగా అనుకూల వారమే.

వృశ్చికం:— నూతన వ్యాపారం కలిసి రాగలదు. నూతన విషయాలు అనేకం తెలిసికోగలరు. నూత్న వస్తు సేకరణకు అవకాశం గలవారం. శుభ కార్య నిమిత్తం ప్రయాణం చేయనున్నారు. ఉత్తరాల మూలంగా కొన్ని విషయాలు తెలిసికో గలరు. స్త్రీలకు: అనుకున్నట్లు ధనం చేతి కందటం, ఉద్యోగంలో కొందరకు అభివృద్ధికి పోయే మార్గమేర్పడటం గమనించగలరు.

ధనుస్సు:— వ్యాపారంలో లోపం కనిపిం చదు. అధిక లాభార్జన చేయ యత్నించుట అనర్థ దాయకం. ధనాదాయమున్నది. విశిష్ట వస్తు సేకరణకు ధనం వ్యయించవలసి రావచ్చు. మిత్ర సహకారం ఒకానొక విషయమునలభించే అవకాశమున్నది. స్త్రీలకు : క్రీడావనిలో రచనా విధానంలో లాభించే మార్గమున్నది.

మకరం:— వస్తువులో, వాహనమో, వస్త్రాలో కొనుగోలు చేయాలని ప్రయత్నిస్తారు. భూముల వలన ధాన్య సేకరణ గలదు. ఏదో విధంగా ధనా దాయంగల వారం. ఆలోచనలు ఫలించ గలవు. బంధు ప్రీతికై ధనం వెచ్చించ వలసి వస్తుంది. వస్తువులు పోగొట్టుకొంటారేమో ! జాగ్రత్త!, స్త్రీలకు: రచనా వ్యాసంగం ఫలవంతం కావటం, పేరు ప్రతిష్ఠలతిశయించుట గమనించ గలరు.

కుంభం:— సంఘసేవకని, మిత్రులసహాయం కొరకని, బంధుప్రీతికనీ, నూతన వస్తు సేకరణ కనీ ధనం వ్యయింప చూస్తారు. వెనుక ముందు లాలోచించి ధనం వ్యయంచేయాలిసిన వారం. చిత్ర రంగంలో, కార్మిక రంగంలో పరిచయమున్న వారికి, ఉత్తమ ఫలదాయకవారం. స్త్రీలకు: కళారంగంలో, వైజ్ఞానిక రంగాన, క్రీడావనిలో, ఉద్యోగంలో సత్ఫలితములుండ గలవారం.

మీనం:— సంభాషణా క్రమమందు గాని, నిత్యవ్యవహారమందు గాని, వ్యాపార వ్యవహారాలందు గాని ఎంతో జాగ్రత్త వహించవలసిన వారం. ధనాదాయమున్నది. స్త్రీలకు: ఆరోగ్యలోపం లేక పోవటం, ఆదాయానికి లోపం రాకపోవటం గమనింపదగిన అంశాలు. కార్యసాధన సూచక వారమే.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఈ వేసవిలో ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?

ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి. ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది.

- చెమటను పీల్చుకొని, చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది.
- క్రిముల పెరుగుదలను విరోధిస్తుంది.
- చల్లదనం, హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది.

స్నానము తరువాత మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి. అది ఒక్కటే ఔషధీయుక్తమైన పౌడరు; చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది—తక్షణమే.

నుదురు

మెడ

జాలు

చేతులు

వీపు




చందనపు సువాసనలో కూడా దొరుకుతుంది.

**ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.**

Johnson & Johnson

*Trademark © J&J 78

OBM-4317/R Tel

# పాణిగ్రహణం

పాణిగ్రహణమంటే చేతిని పట్టుకోవడమనే అర్థం. అయితే ఈ పదం అనాదినుంచీ వివాహమనే అర్థంలోనే వాడబడుతూ ఉన్నది. వివాహం ప్రధానమైనది పాణిగ్రహణమే! కన్యతండ్రి వరునికి తన పుత్రికను సహధర్మచారిణిగా నిర్ణయించి ఆమె చేతిని, వరుని చేతిలో పెట్టి అప్పగిస్తాడు. ఇది కన్యాదాన సమయంలో జరగవలసినది. రామాయణంలో జనకమహారాజు రామునికి సీతను అప్పగిస్తూ

"ఇయం సీతా మమ సుతా
సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే
పాణింగృహ్ణీష్వ పాణినా"

అని చెప్పాడు. వరుడు వధువు చేయి పట్టుకొని అగ్నిచుట్టూ ప్రదక్షిణంచేసి, ఎట్టి పరిస్థితులలోనూ ఆమెను విడిచిపెట్టనని ప్రమాణం చేస్తాడు. వివాహంలో ముఖ్యమైనది ఇదే! తర్వాత జీలకర్ర, బెల్లం కలిపి ముద్దచేసి వధువు తలపై ఉంచడం ముఖ్యమైనది. అదే ముహూర్త సమయం.

## ధర్మపథం

ఆ రెండు వస్తువులు ఒకదానితో ఒకటి ఏ విధంగా అతుకుకొని వుంటాయో ఈ నూతన దంపతుల మనస్సులు కూడా విడువంటేపొర పొచ్చెములు లేకుండా, కలిసి పోవాలని అభిప్రాయం. తలమీద వాటిని ఉంచడంవల్ల తలపై చెయ్యివేసి "నిన్ను నేను విడవను. ఐకమత్యంతో ఉంటాను" అని ప్రమాణం చెయ్యడమన్నమాట.

వివాహంలో పాణిగ్రహణానికి ఉన్నంత ప్రాధాన్యం మంగళసూత్ర ధారణకు లేదు. కాని, కాలక్రమాన పాణిగ్రహణానికి ఉండిన ప్రాధాన్యం మంగళసూత్ర ధారణకు వచ్చింది.

వివాహపు తంతు అంతా పూర్తి అయిన తర్వాత "అప్పగింతలు" జరపబడుతున్నవి. అప్పుడు వధువు తండ్రి తన పుత్రిక చేతిని అల్లుని చేతిలోపెట్టి జాగ్రత్తగా చూచుకోవలెనని అప్పగిస్తాడు అంతేకాకుండా వరుని తల్లిదండ్రులకు కూడా అప్పగించడం ఆచారమయింది. వరుని పక్షాన ఉండిన పెద్దలకు కూడా అప్పగించడం కొన్నిచోట్ల కానవస్తున్నది. అప్పుడు చదివే శ్లోకం యిది—

"అష్టవర్షా భవేత్ కన్యా
పుత్రవత్పాలితా మయా,
ఇదానీం తవదాస్యామి
దత్తా స్నేహేన పాల్యతామ్"

"ఎనిమిదేళ్ల యీ కన్యను నా కొడుకు వలెనే పెంచాను. ఇప్పుడు నీకు ఇయ్యగలను. ఇచ్చిన యీ కన్యను ప్రేమతోను, స్నేహంతోను చూచుకో" అని దీని అభిప్రాయం.

ఇందులో "దాస్యామి-ఇయ్యగలను" అని ఉండడంవల్ల యిది వివాహ ముహూర్తానికి ముందు జరగవలసిన పనిగా తెలుస్తున్నది. కాని-యిప్పుడు— అప్పగింతలప్పుడు చదవడం ఆచారంగా మారిపోయింది. అంతేకాదు. "తవ దాస్యామి — నీకు ఇవ్వగలను" అని వున్నందున వరునకు అప్పగించినప్పుడే దీనిని చెప్పాలి. వరుని తల్లికి, తండ్రికి అప్పగించినపుడు ఈ శ్లోకాన్ని చదువుతూఅప్పగించడం అర్థంలేని ఆచారం

ఈ విధంగా అర్థంలేని ఆచారాలు కొన్ని సంప్రదాయంగా మారిపోయాయి.

— బులుసు వేంకటరమణయ్య



'కలియుగ రాముడు'లో రతి

'ప్రేమ కానుక'లో శ్రీదేవి, అక్కినేని

## రాణీకాసుల రంగమ్మలో సీతన్న పగటి కలలు

ఆలయం ... "నువ్వెక్కడికీ వెళ్లక్కర్లేదు, రంగమ్మా! నువ్వో కొంప కట్టుకునే వరకూ ఈ గుళ్ళోనే ఉండు," అని పూజారి (వల్లం నరసింహారావు), రంగమ్మ(శ్రీదేవి)తో అంటూండగా సీతన్న (నూతన్‌ప్రసాద్) వస్తూ, "అవును, రంగమ్మా! పూజారిబాబు సెప్పినట్టు సెయ్యి. మంచికీ సెడ్డకీ – అన్నిటికీ తోడు నీడగా నేనుంటానుగా ?" అన్నాడు.

"మహా గొప్పోడవ్ బయల్దేరావ్. నాకేం సెయ్యక్కర్లేదు. నా బతుకు నేను బతకాగలను. పూజారయ్య సెప్పినట్లు – కష్టపడి, సొంతంగా ఓ యిల్లు కట్టుకోగలను. నీ గురించి నువ్వాలోచించుకో!" తీక్షణంగా చూసింది రంగమ్మ.

"ఆసెవ – నాకెందుకు. అన్నీ ఆలోసించి పెట్టడానికి నువ్వున్నావుగా ?" ఆశతో చూశాడు సీతన్న.

"ఆఁ ... వుంటాను. అలాగే కలలు కంటూ ఉండు," హేళనగా చూసింది రంగమ్మ.

పూజారి అమాయకంగా "మీ కలలు ఫలించేలా ఆ దేవుడు చల్లగా చూస్తాడు ... తొందర పడకండి," అంటూ తన దారినపోయాడు.

సీతన్న ముఖం వికసించింది. రంగమ్మ ముఖం ఎరుపెక్కింది.

టి. ఎల్. వి. ప్రసాద్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తాతినేని ప్రకాశరావు నిర్మించిన అనిల్ ప్రొడక్షన్స్ "రాణీకాసుల రంగమ్మ"లో చిరంజీవి, జగ్గయ్య, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, సారథి, కృష్ణవేణి, జయమాలిని, మున్నగు ఇతర నటవర్గం. దాసం గోపాలకృష్ణ, వేటూరి, చక్రవర్తి, దేవరాజ్ తోట, కణ్ణన్, కృష్ణమూర్తి తెరవెనుక కృషిచేశారు.

# సినిమా

—జి. వి. జి.

## ఇప్పుడు...
## అందానికి ఒక కేలమైన్

# పాండ్స్
# కేలమైన్ లోషన్

## పూసిన అందం,
## సంరక్షించే గుణం,
## తాజా మురిపెం,
## మీ చర్మానికిది లాభమయం.

చర్మానికి ఆరోగ్యంతోబాటే అది ఒక అందాల గని కావాలని కోరుకోరామరి ? ఈ రెంటి కోసమూ యిదుగో కొత్త పాండ్స్ కేలమైన్ లోషన్ :
మచ్చలేని, నిర్మలమైన శోభ, చల్లదనం యిక మీ వంటిపైన—గాలిలోని, సంతోషం విరిసే, మారని ఆ తాజాదనం. మేకప్ వేసుకునే ముందైనా, లేదా దానంతట ఆదిగానే వాడటానికి వీలు. సుగంధం విరజిమ్మే, అందాన్నిచ్చే పాండ్స్ కేలమైన్ లోషన్.




**పాండ్స్**



# సినిమా

## సత్యం శివం లో సత్యం చెప్పిన సత్యం

భవనం ముందు లాన్‌లో రంగుల గొడుగు కింద – గార్డెన్ ఛేర్‌లో కూర్చొని నాగరాజా (సత్యనారాయణ) బీర్ సేవిస్తున్నాడు. పక్కన అన్నమో రామచంద్ర (త్యాగరాజు) నిలుచొని ఉన్నాడు. ఇంతలో సత్యం (ఎ. ఎన్. ఆర్.) వచ్చి, "నేను సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ సత్యాన్ని. సత్యాన్ని బయట పెట్టడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తుంటాను," అన్నాడు.

"ఇలా ఎందుకు వచ్చినట్టు?" అడిగాడు నాగరాజా.

"మీరు పెద్దమనిషని నాకు బాగా తెలుసు. అందుకే పెద్దమనసుతో చలపతిరావు అనే పోలీస్ ఆఫీసర్‌కు మీరు చాలా సాయం చేయబోయారు. ఆయన వద్దన్నారు. ఆ మరునాడే మరణించారు."

"మిస్టర్ సత్యం! నీ అర్థంలేని వాగుడు వింటూ కూర్చోడానికి నాకు టైమ్ లేదు. నా భోజనానికి వేళయింది," అంటూ నాగరాజా లేచాడు.

"వెళ్ళు! వెళ్ళి కడుపునిండా తృప్తిగా తిను. ఎందుకంటే – వెండి పళ్ళెంలో విలువైన తిండి తినే నువ్వు – త్వరలో రేకు పళ్ళెంలో సంకటిముద్ద తిందువు సెంట్రల్ జైల్లో..."

"నువ్వు కోరుకున్నట్టుగా ఆ గతి నాకు పట్టాలంటే – నేను నేరం చేసినట్టుగా నీ దగ్గర బలమైన సాక్ష్యం ఉండాలి. నీ దగ్గర ఆ సాక్ష్యం లేకపోతే – నువ్వు కాదు కదా, నీ బాబు కూడా నన్నేం చేయలేడు, బేటా!" అంటూ నాగరాజా మీసం మెలివేశాడు.

సత్యం ఒక్క క్షణంపాటు ఆలోచించాడో లేదో – ఫెడేల్‌మని అన్నమో రామచంద్రని బలంగా కొట్టాడు. నాగరాజా తోక తొక్కిన త్రాచులా బుసలు కొడ్తూ, "ఎంత పొగరురా నీకు? నా ఇంటికి వచ్చి, నా మనిషిని కొడతావా? నిన్ను కోర్టుకి లాగ్గలను జాగ్రత్త!" అన్నాడు.

సత్యం నవ్వి, "ముందు నేను నీ ఇంటికి వచ్చినట్టు, నీ మనిషిని కొట్టినట్టు సాక్ష్యం సంపాదించి, ఆ తర్వాత కోర్టుకి వెళ్ళు!" అంటూ బయలుదేరాడు

ఖంగుతిన్న నాగరాజా కొన్ని క్షణాలపాటు తెల్లబోయి చూస్తూండిపోయాడు.

ఎన్. టి. ఆర్., ఎ. ఎన్ ఆర్; శ్రీదేవి, రతి అపూర్వమైన భూమికలను పోషించిన ఈశ్వరీ క్రియేషన్స్ "సత్యం – శివం" చిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో డి. వెంకటేశ్వర రావు నిర్మించారు.

## కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో రోజా మూవీస్ చిత్రం

"ఏప్రిల్ 17 నుంచి 21 వరకు తొలి షెడ్యూల్. మే 15 నుంచి 30 వరకు ఊటీలో రెండవ షెడ్యూల్. మూడవ షెడ్యూల్ జూన్ 15 నుంచి 30 వరకు మద్రాసులో జరుగుతుంది," అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వంలో ఎం. అర్జునరాజా, శివరామరాజా నిర్మించే చిత్రంలో ఎన్. టి. ఆర్, శ్రీదేవి, చిరంజీవి, జయంతి, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, నాగేష్ ప్రభృత నటవర్గం సత్యానంద్, చక్రవర్తి, కె. ఎస్ ప్రకాష్, భాస్కరరాజా, కోటగిరి వెంకటేశ్వరరావులతో కుమార్‌జీ నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

## పుణ్య దంపతులు

ఎన్ టి. ఆర్. సినీ క్రియేషన్ అండ్ డెడికేషన్ పతాకంలో పై చిత్రం 1982లో తయారౌతుంది." అది నా షష్టిపూర్తి సంవత్సరం అదే వయసులో పదవీ విరమణ చేసిన ఒక కలెక్టర్ పాత్ర ధరిస్తున్నాను," అని ఎన్. టి ఆర్ తెలియజేశారు

'సప్తపది'లో రమణమూర్తి, జానకి



# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.

2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

Glaxo
Glaxo
nycil*
PRICKLY HEAT
POWDER

నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.

చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకు నుండి అతి శీఘ్రంగా ఉపశమనమునిస్తుంది.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

CASGLN-4-244 TEL

## సినిమా

### మాయదారి అల్లుడు

"సస్పెన్స్ చిత్రం," అన్నారు నవభారత్ బాబూరావు. ఈయన నిర్మించే జి. వి. కె. ప్రొడక్షన్స్ "మాయదారి అల్లుడు" చిత్రంలో కృష్ణ, జయప్రద, శ్రీధర్, సత్యనారాయణ, గిరిబాబు, గీత, జయభాస్కర్, హేమచందర్, హరిబాబు, ఝాన్సి, అల్లురామలింగయ్య, రాజ్ బాబు, జగ్గయ్య ముఖ్య పాత్రధారులు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. లక్ష్మణ్ గోరే ఛాయ, కె. నాగేశ్వర రావు – డి. సత్యనారాయణ కూర్పు, పి. చంద్రమౌళి ప్రొడక్షన్, త్రిపురనేని వరప్రసాద్ సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు. "మే 1 నుంచి మే 10 వరకు తొలి షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు ఈ చిత్ర దర్శకుడు కె. ఎస్. ఆర్. దాస్.

### టింగు రంగడు

"జూలై నుంచి పూర్తిగా ఔట్‌డోర్‌లో తీస్తాం," అన్నారు టి. ఎల్. వి. ప్రసాద్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఈయన తండ్రి తాతినేని ప్రకాశరావు నిర్మించే అనిల్ ప్రొడక్షన్స్ "టింగు రంగడు" చిత్రానికి త్వరలోనే నటవర్గం, సాంకేతికవర్గం ఎంపిక జరుగుతుంది.



'రామలక్ష్మణులు'లో జయసుధ, మధవి

## నటసామ్రాట్ లో 'నస' పంతులు

ఉదయం పది గంటలవుతోంది. పంతులు (సాక్షి రంగారావు) పడక కుర్చీలో కూర్చొని, బయట వరండాలో పేపర్ చదువుకుంటున్నాడు. రాజా(చంద్రమోహన్)ఉషారుగా సిగరెట్ కాలుస్తూ వచ్చిన వాడల్లా గుమ్మంలో పంతుల్ని చూసి, గబగబా రెండు దమ్ములులాగి అవతల పారేసి, లోపలికి వెళ్లబోయాడు. అతన్ని పంతులు ఆపి, "రావయ్యా, రా ! ఇంటి అద్దె అడగనులే. అడిగినా మాత్రం నువ్వెక్కడ్నుంచి తెచ్చిస్తావ్ లే," అన్నాడు.

రాజా వినయంగా "ఏమిటి, మాస్టారూ ?" అన్నాడు నీళ్ళు నములుతూ.

పంతులికి నస ప్రారంభమైంది. "ఏమిటయ్యా అసలు నువ్వు మొగాడివేనా అని ? భార్యాపిల్లాడూ, ఆ మూతికో మీసం ఉండగానే మొగాడు అవడయ్యా. ఉద్యోగం పురుష లక్షణం – అన్నారు. అదేదీ నీకు ? ఏదయ్యా? పొద్దున పోతావు. బలాదూరుగా తిరిగివస్తావు. నాటకాలంటావు. కచేరీలంటావు. ఎన్నాళ్ళిలా వెధవ వేషాలు వేస్తూ, ఇరుగు పొరుగు మీద ఆధారపడ్తావ్ ? పాపం, ఆ ఆడకూతురు నీ కోసం, ఆ బిడ్డకోసం ఎంత కాలమని అవస్థ పడగలదు ?"

పంతులి మాటను రాజా అంగీకరించలేదు; అడ్డు చెప్పలేదు. ఉక్రోషం అడ్డువస్తోంది–ఎంతయినా మగాడు కదా ? అందుకని తెలివిగా అన్నాడు : "నిజమే, మాస్టారూ ! దేనికైనా కాలం ఖర్మం కలిసి రావాలి అంటారు. నా ప్రయత్నం నేను చేస్తూనే ఉన్నా ..." అని లోపల్నించి వస్తున్న వంటకాల వాసన పీల్చి, "సరే ... నేను వస్తా. ఆకలవుతోంది," అంటూ లోపలికి వెళ్లబోయాడు.

కాని, పంతులు వదల్లేదు. "ఓరి నీ ఆకలి నెత్తిన వానకురా ! లోకంలో ఆకలంతా నీ కడుపునే ఆ దేముడు పెట్టేసాట్టున్నాడే ?"

"దరిద్రుడికి ఆకలెక్కువని ఊరికే అన్నారా ? వస్తా..." అంటూ రాజా లోపలికి తుర్రుమన్నాడు.

పంతులు నోరు తెరిచి అలాగే చూస్తూండి పోయాడు.

రాజా ఇంత బలాదూరుగా ఎందుకు తిరుగుతున్నాడు ? అతను సవ్యమైన మార్గంలోకి ఎలా వస్తాడన్న ప్రశ్నకు సమాధానమే జెమినీ ఆర్ట్ పిక్చర్స్ "నటసామ్రాట్" వర్ణచిత్రమని స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే సి. ఎస్. రావ్ తెలియజేశారు. ఇతర ప్రధానపాత్రల్లో నాగభూషణం, నూతన్ ప్రసాద్, ముక్కామల, కాశీనాథ్ తాతా, ప్రభ, జయమాలిని, జ్యోతిలక్ష్మి, సూర్యకాంతం, కల్పనారాయ్ పాల్గొన్నారు. పోలిశెట్టి కథకు అప్పలాచార్య సంభాషణలకర్త. సాలూరి బాబు స్వరకల్పనలో రోహిణీకుమార్ గీతాలు రాశారు. పి. రామారావు ఛాయ, శాంతారాం శిల్పం, నరేంద్రబాబు నిర్మాణతతో పి. రామ్మోహన్ నిర్మాత.

## జేగంటలులో రగిలే మంటలు

బిందెతో గోదావరి ఒడ్డుకు నీళ్ళకొచ్చింది సీత (ముచ్చెర్ల అరుణ). మోకాళ్ళవరకూ దిగి బిందె ముంచబోతున్నదల్లా ఆశ్చర్యంగా చూస్తూండి పోయింది నీళ్ళవైపు. నీళ్ళలో తన ఫోటో మీద రాయి పెట్టి ఉంది. ఫోటో చేతిలోనికి తీసుకొని పరిశీలించింది సీత. నిజంగా ఫోటో తనదే అని నవ్వుతూ చెబుతోంది ఫోటోలో ఉన్న మరో సీత. ఆమెకు ఆశ్చర్యమూ, ఆనందమూ ముప్పిరిగొన్నాయి. ఫోటోను తీసుకొని బిందెలో వేసుకుని గబగబా నడిచింది.

గట్టుకింద నుంచి పైకి లేచిన రాజా (రామ్ జీ) రేవు దాటెళ్లిపోతున్న సీతను చూసి తన ప్లాన్ సక్సెస్ అయినందుకు హుషారుగా గంతేసి ముందుకు పరుగెత్తాడు. సీత విషయంలో జయించానన్న ఆనందంతో గంతులు వేస్తూ, గోదావరి రేవు నుంచి ఊరి చివర ఎలిమెంటరీ స్కూల్ వైపు సాగాడు. స్కూల్ ఆవరణలో పిల్లలు బంతి ఆట ఆడుతున్నారు. రాజా పరుగున అటు వెళ్లి, నాళ్ళాడే బంతిని ఉత్సాహంతో తన్నాడు. బంతి అటుగా వెళ్తున్న సింగన్న (ప్రభాకరరెడ్డి) గుండెకు తగిలింది.

బంతిని, రాజాను మార్చి మార్చి చూశాడు సింగన్న. రాజా తన బద్ధ శత్రువు మాధవయ్య తమ్ముడు కొడుకని గతంలోనే తెలిసిన సింగన్న, రాజాని శపించేలా చూసి, "బంతితో ఆడుకో. గుండెలతో కాదు," అన్నాడు.

తల వొంచుకొని, "పొరపాటయిపోయింది," అన్నాడు రాజా.

"కాదు; పుట్టుకలాంటిది," అని సింగన్న పెద్ద అంగలేస్తూ వెళ్లిపోయాడు.

రాజా నిర్ఘాంతపోయి చూస్తూండిపోయాడు

మాగంటి రవీంద్రనాథ్ చౌదరి, కె. నరసింహం నాయుడు సమర్పించే జ్యోతి చిత్రవారి "జేగంటలు" చిత్రానికి విజయబాపినీడు కథకుడు. ఆత్రేయ సంభాషణలకర్త. వేటూరి గీతాలకు మహదేవన్ సంగీతమిచ్చారు. ఎస్. గోపాలరెడ్డి ఛాయ, తోట శిల్పం, జి. జి. కృష్ణారావు కూర్పు, కె. వి. రమణమూర్తి సహకార దర్శకత్వం, జి. కౌసలేంద్ర సహాయ దర్శకత్వం, యోగానంద్ ప్రొడక్షన్ నిర్వహించారు. శ్రీనివాసరావు దర్శకత్వంలో కె. మురారి, విజయబాపినీడు నిర్మాతలు.

'భోగభాగ్యాలు'లో కృష్ణ, శ్రీదేవి



# సినిమా



'గువ్వల జంట'లో ప్రసాద్‌బాబు, కృష్ణంరాజు

## గడసరి అత్త — సొగసరి కోడలులో మిడిమేలవు మామ

వరలక్ష్మి (రమాప్రభ) వడ్డిస్తూ, "సరిగ్గా తిను. వంటికి మంచిది," అంది.

సింహాలు (రాజ్‌బాబు) "ఊఁ... గట్టిగా అరవకు. మనది మూగప్రేమ," అన్నాడు.

"ఏం మూగప్రేమో! ఉప్పూ కారం లేని కూరలాగా చప్పగా ఉంది. ఒక ఆటా లేదు; పాటా లేదు."

ఇంతలో వరలక్ష్మి తండ్రి అప్పారావు (పి. ఎల్. నారాయణ) "చెట్టంత కొంపను గాలికొదిలేసి, ఎక్కడికెళ్ళారబ్బా వీళ్ళంతా ?" అంటూ హాలులో కొచ్చి చూశాడు.

"ఎవడో సినిమాలో నాన్నలాగా మధ్యలోస వచ్చాడు చూడు," అంది వరలక్ష్మి.

"ఎవడో పనోడు అయివుంటాడు," అని సింహాలు గొణిగేలోగా "ఎవడ్రా నువ్వు ? లే ఇక్కడ్నుంచి !" అంటూ వంటింట్లోకి విరుచుకు పడ్డాడు అప్పారావు. కూతుర్ని చూసి, "ఏమే, నీకు బుద్ధి లేదూ ? నువ్వు ప్రేమించవలసిందీ, పెళ్ళి చేసుకోవలసిందీ బావనే ! యాభై ఎకరాలు అద్వాన్సు ఇచ్చానే ! ఈ అడ్డగాడిదను ప్రేమిస్తావా ? నిన్ను ఈ పాలేరు క్లాసు — పదెకరాల క్లాసులో పెంచానా ? యాభై ఎకరాల క్లాసులో పెంచాను. అసలు నీ సంగతీ, నీ బావ సంగతీ, ఈ పెళ్ళి సంగతీ తేల్చేస్తాను. నడు—నడు !" అంటూ కూతురి చెయ్యి పట్టుకొని లాగాడు.

"నా పాట నీ నోట పలకాలి చిలకా !" ఏడ్పుముఖం పెట్టాడు సింహాలు.

"ఆ తర్వాతొచ్చి పలుకుతాలే ! నాన్నకు తెలియకుండా వస్తాలే," అనునయంగా చూసింది వరలక్ష్మి.

అప్పారావుకు చిర్రెత్తిపోయింది. "పళ్ళు రాలగొడతా ! ఒరేయ్, ఇది నాకు తెలియకుండా నీ దగ్గరకొస్తే, నీ కాళ్ళు విరగ్గొడతాను," అన్నాడు.

"నువ్వే సన్నగా ఉన్నావ్ ! నువ్వేం విరగ్గొడతావ్ ?" వెకిలిగా చూశాడు సింహాలు.

అప్పారావు, కూతుర్ని లాక్కెళ్ళిపోయాడు.

కృష్ణ, శ్రీదేవి, భానుమతి ముఖ్య భూమికలు నిర్వహించిన రాధాకృష్ణ క్రియేషన్స్ "గడసరి అత్త — సొగసరి కోడలు" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన కట్టా సుబ్బారావు "మే 2 నుంచి రీ రికార్డింగ్ మొదలవుతుంది. హీరో కృష్ణ జన్మదిన కానుకగా మే చివరి వారంలో విడుదల చేస్తాం," అన్నారు. గోరంట్ల వీరయ్య చౌదరి, సోమిశెట్టి సుబ్బారావు ఈ చిత్ర నిర్మాతలు.

## మా ఇంటి ప్రేమాయణంలో మిరియాల్రావ్ వంకాయ పులుసు

వంటగది. మిరియాల్రావు (నూతన్‌ప్రసాద్) గుత్తివంకాయలు తరిగి, స్టౌమీద మరుగుతూన్న పులుసు గిన్నెలో వేశాడు. పులుసు చింది పైకెగిరే సరికి "అబ్బా !" అంటూ ముఖం తుడుచుకొని, గిన్నెలోంచి ఒక వంకాయను తొడిమతో పైకి తీసి పట్టుకున్నాడు. ఇంతలో ఆనంద్ (చంద్రమోహన్) "మిరియాల్రావ్ ! ఏం కూర అది ?" అంటూ వచ్చాడు.

"మిరియాల్రావ్ పర్యవేక్షణలో తుది మెరుగులు దిద్దుకుంటున్న వంకాయ పులుసు !"

"అబ్బా ! నోరూరుతూందే ! అసలు నీకెలా అబ్బింది గురూ ఈ కళ ?"

"అదొక పెద్ద కతయ్యా ! కాలేజీ రోజుల్లో చదువు అబ్బక 'మిరియాల్రావ్ మెస్' అని హోటల్ పెట్టాను. అసలు మిరియాల్రావ్ స్వర్ణయుగం అంటే అదే. హోటల్ ముందు 'గుత్తివంకాయ పులుసు మా ప్రత్యేకత' అని బోర్డ్ పెట్టాను. ఇంక జనం ఎగబడ్డారు చూడూ — మలయాళీ సెక్స్ సినిమా కెగబడ్డట్టే ! జనాన్ని కంట్రోల్ చేయలేక — చివరకు రిజర్వ్ పోలీసుల్ని పెట్టి మరీ హోటల్ నడపాల్సొచ్చింది."

"మరా హోటల్ ఏమయింది ?"

"మూతపడింది... ఒకరోజు బాగా రష్‌గా ఉన్నప్పుడు — గుత్తివంకాయ పులుసు వడ్డిస్తూంటే, అందులో ఓ ఎలుకొచ్చింది. అది విస్తట్లో పడ్డవాడు — లోక పట్టుకుని పైకెత్తి, 'ఎలుకా ! ఎలుకా !' అని పిచ్చిలాగా అరిచాడు. వాడి చేతినుండి ఎలుక లాక్కొని, 'ఇది ఎలుకా ? కాదోయ్ ! గుత్తి వంకాయ' అంటూ గుటుక్కున మింగేశాను."

"అబ్బా ! ఎంత అద్భుతమైన బుర్ర గురూ, నీది ?"

"నేనూ అలాగే అనుకున్నాను. కాని, అందరూ కలిసి నన్ను చితకతన్నిందేకాక, పామాను లక్ష్మీ దొరికింది దొరికినట్లే పట్టుకెళ్ళారు. ఆ తర్వాత రాధారాణిగారి దగ్గరకొచ్చి ప్రాధేయపడితే, ఈ ఉద్యోగం దొరికింది," అంటూ వివరించాడు మిరియాల్రావు.

చంద్రమణి ప్రొడక్షన్స్ "మా ఇంటి ప్రేమాయణం" చిత్రాన్ని ఆలూరి రవి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీమతి కె. చంద్రమణి నిర్మిస్తున్నారు.

'మా పెళ్ళి కథ'లో కట్టా సుబ్బారావు, మురళీమోహన్



## కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి. సులభంగా దెబ్బ తింటాయి.

# కాల్షియం-శాండోజ్ ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు. అయినా అవి మీ పిల్లల పెరుగు దలకు, వికాసానికి అతిముఖ్యమైనవి. కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం. కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత, పెళుసుతనం సంభవిస్తాయి. పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి.

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డకి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి. ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్ఠం చేయబడింది.

మీ బిడ్డదు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు. అది తిరిగి సమకూర్చాలి. లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది. మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు.

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మతు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి. అన్ని కాల్షియం బిళ్లలు ఒకటేకావు.

**కాల్షియం—శాండోజ్ మాత్రమే కావాలని అడగండి. మారుగా యిచ్చే ఏ యితర వాటితోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్— స్విట్జర్లండులోని శాండోజ్ వారిచేత పెంపొందించబడిన అత్యుత్తమమైన కాల్షియం.



## గట్టిపళ్లు, పటిష్ఠమైన ఎముకల కోసం కాల్షియం-శాండోజ్®




daCunha/S-25/TL



'తీర్థయాత్ర'లో జమున, రూప

## మా పెళ్ళి కథలో పదవసారి పరీక్షలు!

ఎగ్జామినేషన్ హాలు... పరీక్ష రాస్తూన్న ప్రకాష్ (నూతన్‌ప్రసాద్) టేబుల్‌మీద ఏవో కాగితాలుండడం చూసిన కాలేజీ లెక్చరర్ భాస్కర్ (శ్రీధర్) "ఏయ్, మిస్టర్! వాట్ ఈస్ దిస్?" అన్నాడు.

"చాటుగా కాపీ కొడ్తే – ఏది రాశానో ఏది రాయలేదో తెలియక కన్‌ఫ్యూస్ అయిపోతాను, సార్! అందుకే టేబుల్‌మీద పెట్టి రాస్తున్నాను... మిగతా పనులుంటే చూసుకోండి, సార్! ఇచ్చెయ్యండి, సార్! నా టయిమ్ వేస్ట్ చేయకండి, సార్!" అన్నాడు ప్రకాష్.

భాస్కర్‌కు కోపం ఆగింది కాదు. "ప్లీస్, గెట్ అవుట్!" అన్నాడు.

"చూడండి, సార్, నేను పది సంవత్సరాల నుండి బి. ఎ., పరీక్షలు రాసి, యూనివర్శిటీకి పర్మనంట్ కస్టమర్‌నైపోయాను. కాని, వాళ్ళు నామీద ఏం పగబట్టారోగాని, నన్ను పాస్ చెయ్యలేదు. నేను ఈసారిగాని తప్పితే, నాకు ఉద్యోగం ఇస్తానన్న ఎం. ఎల్. ఎ. అప్పలకొండగారు నాకు ఉద్యోగం ఇవ్వరు, సార్! ఈ సంవత్సరం ఆయన సీటు దిగిపోతాడు. ఆ తర్వాత మళ్ళీ గెలుస్తాడన్న గారంటీ లేదు. ఒకవేళ ఆయన గెలిచినా – నాకు ఏజ్‌బార్ అయిపోతుంది, సార్!"

"ఐ సే గెట్టవుట్! బయటకు వెళ్తావా, ప్యూన్‌తో గెంటించమంటావా?"

"అక్కర్లేదు, సార్! నేనే వెళ్తాను. ఓ–కే... చూడండి, సార్! నేనసలే ఆంగ్రీ యంగ్‌మాన్‌ని – అమితాబ్‌బచ్చన్‌లాగా... నిన్ను ఉత్తినే వదిలిపెడ్తాననుకోకు, మిస్టర్!..." అంటూ ప్రకాష్ లేచి, టేబుల్‌మీది సిరాబుడ్డు, పెన్నులతో విసురుగా వెళ్ళిపోయాడు.

కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ నిర్మించే రామ్ శ్యామ్ ఆర్ట్ క్రియేషన్స్ "మా పెళ్ళి కథ" చిత్రానికి కాశీ విశ్వనాథ్, వేటూరి, రాజన్–నాగేంద్ర, రంగా, కె. సత్యం, కొండపనేని, ఎస్. ఎ. కృష్ణారావు, ఎల్. రామకృష్ణంరాజు, పి. శ్రీనివాస్, కొల్లి రాఘవేంద్రరావు తెరవెనుక కృషి చేస్తున్నారు. ★

## విదేశ వార్తలు

★ "కేన్నరీరో" అనే చిత్రంలో తన కాంట్రాక్ట్‌ను రద్దు చేసినందుకు రాఖెల్ వెల్ష్ అనే తార ఎం. జి. ఎం. సంస్థపై 24.5 మిలియన్ల డాలర్లు నష్టపరిహారంగా దావా వేసింది.

★ పాకిస్థాన్‌లో దిలీప్‌కుమార్ పట్ల ఎంత గౌరవమంటే – అక్కడ టి. వి. లో ఎప్పుడైనా భారతీయ చిత్రాలు చూపిస్తున్నప్పుడు–వాటిలో దిలీప్ నటించినవి ఉంటే, అక్కడి మహిళలు గౌరవ సూచకంగా బురఖాలు వేసుకొని మరీ తిలకిస్తూంటారట.

★ హాలీవుడ్ నటి మార్లిన్ మన్రో మరణించినప్పుడు ఆమె వద్ద మిగిలిన ఆస్తి షుమారు నాలుగు లక్షల డాలర్లట. కాని, ఆమె మరణించాక విడుదలైన రెండు చిత్రాల ద్వారా ఆమె పేరున సంక్రమించిన రాయల్టీ ఎనిమిది లక్షల డాలర్లట.

★ ఆరున్నొక్క సార్లు విడాకులిచ్చిన 48 ఏళ్ళ ఎలిజబెత్ టేలర్ తన ఆత్మకథ రాసి, స్విట్జర్లాండ్‌లోని ఒక బాంక్ 'లాకర్'లో పదిలపరచింది. "దాన్ని ఎప్పుడు అచ్చువేయించి రచ్చకెక్కిస్తారు?" అని ఒక పాత్రికేయుడు అడిగితే, "కొంతకాలం ఆగాలి," అందట. అంటే – తాజా భర్త జాన్ వార్నర్ (రిపబ్లికన్ సెనేటర్)కు కూడా విడాకులిచ్చాక గాని విడుదల చెయ్యదేమో!

★ దుబాయ్‌లో "షాన్" చిత్రం విడుదల చేసే ప్రయత్నంలో జి. పి. సిప్పీ దుబాయ్‌కి వెళ్ళగా అక్కడ అంతకు ముందు నుంచే ఆ చిత్రం తాలూకు వీడియో టేప్‌లు విరివిగా విక్రయమవుతున్నట్లు తెలిసి విస్తుపోయాడు. ఆ వీడియో టేప్‌ల గురించి ప్రచారం మాత్రం పబ్లిక్‌గానే సాగుతోందట! మరో విషయం "షాన్"లో సునీల్‌దత్ పేరుకు గెస్ట్ ఆర్టిస్టే కాని, 50 కాల్‌షీట్లలో పని చేశాడట.

వెల్లూరులో జరిగిన 'శ్రీవారి ముచ్చట్లు' శత దినోత్సవ వేడుకల దృశ్యాలు. (ఫొటో : శ్రీధర్)





# కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ <u>వెనుక</u> కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య <u>చిన్నది</u>గా <u>క్లుప్తం</u>గావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ <u>మీద</u> పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపు అతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

సీరియల్

# రాగబంధాలు

వేమకోటి సీతారామ శాస్త్రి

(గత సంచిక తరువాయి)

"నిజంగా తోడబుట్టిన అన్నయ్యలా మీరు నా కెంతో సహాయపడ్డారు. ఏమిచ్చి మీ ఇద్దరి ఋణం తీర్చుకోగలను" అంది లలిత కృతజ్ఞత వుట్టిపడే స్వరంతో.

"అది మేం తర్వాత ఆలోచించి చెబుతాం" అంది నవ్వుతూ.

బస్సు గమ్యస్థానం చేరుకోబోతోంది. నీరజ, రాంబాబు శరీరాలు, బస్సు గతుకుల్లో ప్రయాణించినపుడల్లా రాసుకుంటూనే వున్నాయి !!

"ఇదేమిటి, మీ శరీరం వేడిగా వుందా! లేక నా ఒళ్లు చల్లబడిపోతోందా!" అన్నాడు రాంబాబు నవ్వుతూ. నీరజ శరీరం ఎందుకో వేడిగా ఉన్నట్లు అనిపించింది. నీరజ నవ్వేసింది.

* * *

ఆఫీసులో పేరుకుపోయిన పనిని చకచక చేసుకు పోతున్నాడు. శివకుమార్ పదిహేను రోజులు శెలవు పెట్టాడట. అందువలన ఆఫీసంతా ప్రశాంతంగా వుంది. నీరజ ఆఫీసుకు రాలేదు. బహుశా ప్రయాణ బడలిక తీరలేదేమోననిపించింది, రాంబాబుకు.

"సార్! మీకు ఫోనొచ్చింది సార్" అన్నాడు ఆఫీస్ బోయ్. ఆశ్చర్యపోయాడు రాంబాబు. రిసీవరు తీసాడు.

"నేనండీ, లలితను మాట్లాడుతున్నాను. నన్నూ మా ఆఫీసులో మరో యిద్దరు లేడి టైపిస్టుల్ని హెడ్ ఆఫీసుకు, పదిహేను రోజులు డెప్యుటేషను పంపిస్తున్నారు. ఇవాళే వెళ్లక తప్పదు. అయితే ముఖ్యంగా మీ కెందుకు ఫోన్ చేశానంటే నీరజకు కొంచెం జ్వరంగా వుంది. సాయంగా మా పెద్దమ్మ వుందనుకోండి. ముసలామె కదా. ఓపిక తక్కువ. అదీగాక సాయంకాలమైతే దానికి సమంగా కళ్లు కనిపించవు. మీరు కొంచెం వెంటనే ఇంటికి వెళ్లండి. డాక్టర్ని గూడా యింకా తీసుకురాలేదు. నా కసలు టైములేదు. స్టేషను నుండి మాట్లాడుతున్నాను" అంది లలిత గాబరాగా.

"సరేలెండి. నే నిప్పుడే వెడుతున్నాను. మీరేం అధైర్యపడకండి" అన్నాడు.

రాంబాబు వెళ్లేసరికి నీరజ ఒళ్లు జ్వరంతో పేలిపోతోంది. ముసలామె కొంచెం మిరియాల కషాయం యిచ్చింది.

"ఎలాంటి పిల్ల. ఆఖరికి తోటకూర కాడలా వాడిపోయింది నాయనా" అంది దిగులుతో పెద్దమ్మగారు.

రాంబాబు వెంటనే డాక్టరు దగ్గరకు పరిగెట్టాడు. టైఫాయిడ్ జ్వరం, అని డాక్టరు చెప్పేసరికి రాంబాబు గాబరాపడ్డాడు. ఇంజక్షన్లు ఇచ్చి, డాక్టరు కాప్సూల్సు, టానిక్‌లు రాసిచ్చాడు. ప్రతీ మూడు గంటలకు వొక్కొక్క కాప్సూలు వెయ్యమన్నాడు.

"ఎలా నాయనా! నేను చూస్తే ముసలిదాన్ని. ఓపికలేదు" అంది పెద్దమ్మగారు. రాంబాబుకు ఏమీ తోచలేదు.

కొంచెం తెలివి వచ్చింది నీరజకు. ఆమెకేమీ అర్థంకాలేదు. యేదో బాధతో నలిగిపోతోంది.

"నీరజగారూ! మీ అమ్మగారు, నాన్నగారు యెడ్రసు చెప్పండి" అడిగాడు నెమ్మదిగా. ఆమె తల అడ్డంగా వూపింది.

"పోనీ శాంతినయినా రప్పించమదునా!"

"వొద్దండీ!" అంది నీరసంగా. రాంబాబుకు అర్థంకాలేదు. దేవుడ్ని ఇంట్లో సాయంగా పెట్టి, ఆఫీసుకు పదిరోజులు సెలవు పెట్టాడు. డాక్టరు చెప్పినట్లుగా నీరజకు టైము ప్రకారం మందులు యివ్వసాగాడు. రెండో రోజు కొంచెం స్పృహ వచ్చింది. స్వంతపనిమీద వూరికెడుతున్నాను. పదిరోజులు శెలవు కావాలని రాయించి సంతకం పెట్టి ఆఫీసుకు ఉత్తరం పోస్టు చేయించింది.

నీరజ చర్య రాంబాబుకు యేమీ అర్థంకాలేదు. అయినా ప్రశ్నించలేదు. పదిరోజులు తాను నిద్రాహారాలు మాని నీరజకు సేవ చేశాడు. ఇంటి నుండి దేవుడు సహాయంతో కాఫీ, బార్లీ మొదలైనవి తెప్పించేవాడు.

పదకొండో రోజు తెల్లవారు ఝామున నీరజకు తెలివి వచ్చింది. మాసిపోయిన గెడ్డంతో కాలికొసన మంచం కోడుకు తల ఆనించి నిద్రపోతున్న రాంబాబు కన్పించాడు. నీరజకు బాగా చెమట పట్టింది. వొళ్లంతా తేలికయినట్లుగా వుంది. ఈ పదిరోజుల్లో యేం జరిగిందో ఆమెకు లీలగా గుర్తుకు వచ్చింది. రాంబాబు మందు త్రాగించటం, నుదుట మీద ఐస్ పెట్టడం, కాప్సూల్సు మింగించటం, బార్లీ త్రాగించటం యివన్నీ గుర్తుకు వచ్చాయి. రాంబాబు మీద యెంతో కృతజ్ఞత కలిగింది. నీరసంగానే కళ్లు మూసుకుంది.

కళ్లు తెరిచే సరికి, యెదురుగా రాంబాబు వొక చేతిలో కాప్సూల్, రెండో చేతిలో గాజు గ్లాసుతో నీరు "ముందిది వేసుకోండి. యెలావుంది వొంట్లో" అడిగాడు రాంబాబు.

పదిరోజుల తర్వాత నీరజతో రాంబాబు మాట్లాడడం అదే మొదటిసారి. నెమ్మదిగా ఆమె చేత మింగించి, మంచినీళ్లు త్రాగించాడు. ఆమె చెంపలమీద చెయ్యి వేసి చూసాడు. చల్లగా వున్నాయి.

"ఏదో భగవంతుడి దయవల్ల మీరివాల్టికి మన ప్రపంచంలోకి వచ్చారు" అన్నాడు సంతోషంగా.

ఈ జ్వరం వల్ల నీరజ చిక్కిపోయి[illegible] చక్కనమ్మ చిక్కినా అందమే! నీరజ కొత్త అం[illegible] సంతరించుకుంది. ఉదయం డాక్టరు వచ్చి నీరజను పరీక్షించాడు.

---

**జరిగిన కథ–9 :** ఆ ఆఫీస్‌లో కొత్తగా స్టెనో కమ్ క్లర్క్‌గా జాయిన్ అవుతుంది మిస్ నీరజ. మేనేజర్ శివకుమార్ ఆమెపై ఒక ప్రత్యేకమైన అభిమానాన్ని చూపిస్తుంటాడు. అక్కడే గుమాస్తాగిరి చేస్తున్న రాంబాబు దయనీయమైన పరిస్థితిని చూసిన నీరజ అతనికి ఆర్థిక సహాయం చేస్తుంది. ఓనాడు బస్సులో పరిచయమైన లలిత ఇంట్లో ఓ రూములో వుంటుంటుంది నీరజ. నీరజను ప్రేమిస్తున్నననీ, ఆమె బాధ్యతలను తను స్వీకరిస్తాననీ, పెళ్లి చేసుకుందామనీ శివకుమార్ ఆమెను అడుగగా, నీరజ కొంత టైం కోరుతుంది. జీవితంలో చావుదెబ్బ తిన్న తన స్నేహితురాలు పద్మ గత చరిత్ర గురించి నీరజతో చెప్తుంటుంది లలిత. తన మేనేజర్ సతీష్ పుట్టిన రోజునాడు అతను కోరిన కోర్కె – అతనితో సినిమా ప్రోగ్రాం, ఆ తరువాత అతని ఇంట్లో భోజనం చేయటానికి అంగీకరించు తుంది పద్మ. సతీష్‌ను నమ్మి అతనికి తన సర్వస్వమూ అర్పించుకొంటుంది పద్మ. ఫలితంగా గర్భవతౌతుంది. ఆమెకు తెలియకుండా సతీష్ ఎబార్షన్ చేయిస్తాడు. తరువాత అతని నిజస్వరూపం తెలుసుకొని కుమిలిపోతుంది. సతీష్ ఆమెను ఉద్యోగంలోంచి తీసివేస్తాడు. ఇప్పుడు మరో ఉద్యోగం సంపాదించుకొని గత జీవితాన్ని మరిచిపోవటానికి ప్రయత్నిస్తుంటుంది పద్మ. అజ్ఞాతంగా 'బాబు' అన్న పేరుతో రచనలు చేస్తున్న రాంబాబు తన గత జీవిత చరిత్ర గురించి లలిత, నీరజలకు చెప్తుంటాడు. శివకుమార్ తండ్రి రమణయ్య దశరథరామయ్యగారి కుటుంబాన్ని సర్వనాశనం చేస్తాడు. దశరథ రామయ్యగారి సహాయం పొందిన ఒకాయన ఇప్పించిన ఉద్యోగంలో చేర్తాడు రాంబాబు. అక్కడికి శివకుమార్ మేనేజర్‌గా వచ్చి అతనిని నానా హింసలు పెడ్తుంటాడు. రాంబాబు పరిస్థితుల ప్రభావానికి తలవొగ్గి తన కుటుంబాన్ని అలానే నెట్టుకొస్తుంటాడు... రాంబాబు దయనీయమైన గత జీవితాన్ని తెలుసుకొన్న ఆ రోజు చాలా మంచిరోజుగా భావిస్తారు లలిత, నీరజలు. మూడు రోజులు శెలవులు కలసిరాగా లలిత, నీరజ, రాంబాబు ముగ్గురూ కలిసి నీరజ పిన్నిగారి వూరు వెళతారు. ఆ పిన్ని కూతురు శాంతి, కొడుకు సత్యమూర్తి. ఓ పసిపిల్ల ప్రాణం కాపాడబోయి తన కాలు పోగొట్టుకొన్న సత్యమూర్తిని అంతవరకూ గాఢంగా ప్రేమించిన సునంద అతన్ని కాదని తండ్రి కుదిర్చిన సంబంధమే చేసుకొంటుంది. సత్యమూర్తి ఆ జ్ఞాపకాలను మర్చిపోలేక అలా పర్ణశాలలో నిర్జీవంగా బ్రతుకుతూంటాడు. తన జీవితంలో ప్రవేశించి, తన జీవితాన్ని కాంతిమయం చేయమని లలితను సత్యమూర్తి ప్రాధేయపూర్వకంగా అడుగుతాడు. ఆమె అంగీకరించుతుంది. లోగడ చెప్పిన పద్మ కథ లలితదేనని తెలుసుకొన్న నీరజ మనసు వేదనకు గురవుతుంది. శెలవులయిపోవడంతో ఆ ముగ్గురు తిరుగుముఖం పడతారు.

---

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, క్రొంగొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.






జబ్బు పడ్డప్పుడు బలహీనంగా ఉండటం, ఆకలి లేకపోవటం మామూలే. అలాంటి సమయాలలో మా కుటుంబ సభ్యులకు హార్లిక్స్ ఇవ్వమని మా డాక్టరు శిఫారసు చేస్తారు. హార్లిక్స్ తేలికగా జీర్ణమవుతుందనీ, త్వరగా కోలుకోవటానికి తోడ్పడుతుందనీ ఆయన చెప్పారు.

## మీరు కూడా మీ కుటుంబంలోని వారికి హార్లిక్స్ ఇస్తారు కదూ?"




"ఆరోగ్య పోషణకు మూలాధారం హార్లిక్స్.
వివిధ పోషకాహారాలతో అద్భుతంగా
దానిని తయారుచేశారు.
ఎన్నో ఏండ్లుగా సుస్థిరమైన
మంచి ఫలితాలను యిస్తోంది.
అందుచేతనే మా కుటుంబ
సభ్యుల ఆరోగ్యాభివృద్ధికీ,
వారు రోజుల తరబడి చురుగ్గా
ఉండేందుకూ హార్లిక్స్‌ను
నేను శిఫారసు
చేస్తున్నాను.''



# మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

HTD-HMM-6757

''రాంబాబుగారు, ఈమెకు జ్వరంతగ్గిపోయింది. అయితే నీరసం పోవడానికి కొద్దిరోజులు రెస్ట్ తీసుకోవాలి'' అన్నాడు మందులు, టానిక్‌లు రాసిస్తూ.

నీరజ డాక్టరుకు నమస్కరించింది.

''చూడమ్మా. నీ ప్రాణానికి ఇంకేం భయం లేదు. అధైర్యపడనక్కర్లేదు. నీ ప్రాణాన్ని యమభటులో్తపోట్లాడి రాంబాబు రక్షించుకున్నాడు. వాస్తవానికి నా మందులు నిన్ను రక్షించలేదు'' అన్నాడు, డాక్టరు రాంబాబును ప్రశంసాపూర్వకంగా చూస్తూ. నీరజ రాంబాబు వేపు చూసింది.

''డాక్టరుగారూ! ఇవాళ భోజనం పెట్ట వచ్చునా'' ప్రశ్నించాడు.

''ఆఁ పెట్టించండి'' అంటూ వెళ్ళిపోయాడు డాక్టరుగారు.

''ఇప్పడే ఇంత చారు, అన్నం వండి పెడతాను తల్లీ'' అంటూ పెద్దమ్మగారు ఇంట్లోకి వెళ్ళిపోయింది.

నీరజ రాంబాబును దగ్గరకు రమ్మని పిలిచింది. ఆమె కళ్లనెంబడి కన్నీటి ముత్యాలు జాలువారుతున్నాయి. ''మీకు చాలా కృతజ్ఞతలు'' అంది చేతులు జోడిస్తూ.

''ఛా! అదేమిటి ఏడుస్తున్నారు. నేను చేసినది ఏమీలేదు. మీరు ప్రశాంతంగా వుండాలి. లేనిపోని ఆలోచనలు పెట్టుకోవద్దు. కాస్త హార్లిక్సు తీసుకోండి'' అంటూ, ఫ్లాస్కులో హార్లిక్సు తీసి ఇచ్చాడు. నెమ్మదిగా తాగించాడు.

''ఇంజక్షను ఏమయినా నొప్పిగా వుందా.''

లేదంటూ తల వూపింది. నీరజ కాస్సేపాగి –

''డాక్టరు బిల్లులూ, ఈ మందులు యివన్నీ ఎలాగ చేసారు'' అడిగింది నీరజ. రాంబాబు ఆర్థిక పరిస్థితి ఆమెకు తెలుసు.

''ఎలాగో చేసాన. ఇప్పుడవన్నీ ఎందుకు. మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకోండి'' అన్నాడు రాంబాబు కొంచెం కోపంగా. యేం చేసాడో నీరజకు అర్థం కాలేదు.

''యిప్పుడే మందులు తీసుకు వస్తాను'' అంటూ బయటకు వెళ్ళాడు.

దేవుడు వచ్చాడు. వాడి చేతిలో ప్లాస్టిక్ బుట్టలో పళ్ళూ, ఫ్లాస్కులో బార్లీ తెచ్చాడు.

''యెలా వుంది అమ్మగారూ'' అన్నాడు దేవుడు సంతోషంగా. ''బాగానే వుంది దేవుడూ'' అంది నీరజ తల దిండు మీద ఆనించుకుంటూ.

''కొంచెం బార్లీ తాగుతారా?'' అడిగాడు అభిమానంగా

''తాగుతాను గానీ నాకో చిన్న సహాయం చేసి పెట్టాలి.'' అంది నీరసంగా నవ్వి. దేవుడు పొంగిపోయాడు. గాజుగ్లాసులో బార్లీ పోసిచ్చాడు.

''యిప్పుడు చెప్పండమ్మగారూ'' అన్నాడు వినయంగా.

''యెవ్వరితో చెప్పకు. అసలు మీ బాబుగార్కి డబ్బు యెలా వచ్చిందిరా?'' అడిగింది. దేవుడికి రాంబాబు యింటి విషయాలన్నీ తెలుసు. అందువలన అసలు సంగతి తెలుస్తుందని.

''నాకు తెలియదమ్మగారూ'' అన్నాడు భయంగానే. నీరజ గ్రహించింది.

''భయం లేదురా! నువ్వు చెప్పకపోతే నా మీద ఒట్టే.'' అంది నీరజ.

''అమ్మగారూ! మీ రెవ్వరితో చెప్పకండి. పెద్దమ్మగారు మీ జ్వరంకు డాక్టరుకు డబ్బు ఇవ్వాల్సి వస్తే, తను పసుపుకొమ్ము కట్టుకుని, ఆయమ్మగోరు రాంబాబుగోరికి మంగళసూత్రాలిస్తే నేనూ, ఆయన బజారులో అమ్మి, డాక్టరు ఫీజులు మందులకు ఖర్చు పెట్టాం'' అన్నాడు భయంగానే.







నీరజకు భూమి బ్రద్దలైపోయినట్లనిపించింది. ఆమె మనస్సులో, తుఫాను రేగుతోంది. తన కోసం యింత త్యాగమా! ఆమెకు పార్వతమ్మగారు ఒక దేవతలా కన్పించింది. రాంబాబు సంగతి సరేసరి.

''ఇంక, నువ్వేళ్ళరా దేవుడూ. మధ్యాహ్నంరా'' అంటూ లోపలికి వచ్చాడు రాంబాబు, మందులతో.

నీరజ మౌనంగా యేడవటం గమనించి దగ్గరకు వచ్చాడు. యెందుకేడుస్తున్నాదో అర్థం కాలేదు.

''యేం మళ్లా వొంట్లో యేమైనా బాధగా వుందా'' అన్నాడు ఆమె నుదుటి మీద చెయ్యి వేస్తూ.

నీరజ నెమ్మదిగా రాంబాబు చేతిని తన చేతిలోకి తీసుకుంది. అతను మంచం మీద కూర్చోక తప్పలేదు.

''యెంత పని చేసారు, నా కోసం.'' అంది గద్గదికంగా. అర్థమయి పోయింది, రాంబాబుకు. బహుశా దేవుడు చెప్పి వుంటాడనుకున్నాడు. వాణ్ని మనస్సులోనే తిట్టుకున్నాడు.

''ఇది నా ధర్మం'' అన్నాడు గంభీరంగా.

''యెంతేనా...యింత త్యాగం......''

''ఇందులో త్యాగం యేమీ లేదు.'' అన్నాడు రాంబాబు కళ్లు తుడుస్తూ గంభీరంగా. నీరజ ఆర్ద్రంగా అతనివేపు చూసింది.

''అవును. మీకెవరు వున్నారో లేదో నాకు తెలియదు. ఇంత జ్వరంలో వున్నా మీరెవ్వరినీ పిల వొద్దన్నారు. కారణమేమిటో నాకు తెలియదు. ఇంక మీ పరిస్థితి దిగజారి పోతున్న సమయంలో యింక నాకేం తోచలేదు. భగవంతుడా! ఈ విపరీత పరిస్థితి తప్పించు అని ఎంతగా ప్రార్థించానో. యేదైనా మీరు ఆరోగ్యంతో కోలుకునే లోపుగా మీ వాళ్లకు కబురు పంపిస్తే బాగుంటుందేమో మరి'' అన్నాడు అనునయంగా.

''నాకెవ్వరూ లేరు! నా వాళ్ళు నా దగ్గరే వున్నారు.'' అంది నీరజ సిగ్గుతో అతని చేయిని వదలకుండా.

''నీరజా'' అన్నాడు ఆశ్చర్యంగా రాంబాబు.

''అవును. నేను చాలా పేదదాన్ని. నాకెవ్వరు లేరు. ఈ లోకంలో యెవరైనా వున్నారంటే మీరే నాకు'' అంది అరమోడ్పు కన్నులతో.

''నువ్వు నా నీరజవి. నేను నిన్ను బ్రతికించుకున్నాను. నీ పేదతనం గురించి ఆలోచించడానికి నేనేమీ గొప్పవాణ్ని కాను. నీలాంటి కరుణ మనస్వినిని నా జీవిత భాగస్వామినిగా చేసుకోవడంలో నాకింక కావల్సినదేమున్నది. నీ వాళ్లను మన దగ్గరకు తీసుకువచ్చేద్దాం'' అన్నాడు, ఆమె తలమీద ముంగురులు సవరిస్తూ. నీరజ సిగ్గుపడి పోయింది. పెద్దమ్మగారు ఇంతలో అన్నం తీసుకు వచ్చింది.

''కొంచెం ఎంగిలి పడమ్మా. బాబూ, కొంచెం అమ్మాయికి అన్నం కలిపిపెట్టు'' అని స్టూలుమీద పెట్టి వెళ్లిపోయింది.

''నా కన్నం తినాలనిలేదు.''

''తినకపోతే ఎలా మరి. నీరసం తగ్గాలిగా'' అన్నాడు చారూ, అన్నం కలిపి ఆమె నోటికందిస్తూ. రెండు ముద్దలు తిన్న తరువాత ''ఎలావుంది. సయిస్తున్నదా?'' అడిగాడు లాలనగా.

''అమృతంలా వుంది'' అంది నీరజ కొంచెం సిగ్గుతో రాంబాబు వంక చూస్తూ.

* * *

జ్వరంతగ్గిన పదిహేనురోజులకుకానీ నీరజ బలం పుంజుకోలేదు. నీరసంపోయి వొళ్ళు కొంచెం తగ్గి మెరుపు తీగలా తయారయింది. ఆఫీసులో ఏ కొద్దిమందికో తప్ప నీరజ జ్వరంపడి కోలుకున్నట్లు తెలియదు.

నీరజ అనురాగంతో ఆమె సాహచర్యంలో రాంబాబు కొత్తబలం పుంజుకున్నాడు. జీవితం మీద కొత్త ఆశలు అలలు అలలుగా అతని మస్తిష్కంలో ప్రవేశించాయి. కొత్త అందాలు సంతరించుకున్న నీరజ రోజు రోజుకు కొత్తకొత్తగా కన్పిస్తోంది. స్త్రీ మొగవాడి జీవితంలో ప్రవేశిస్తేనే వొక రకమైన పరిపూర్ణత్వం, స్వాభిమానం, సాహసం, సంతృప్తి కలుగుతాయేమో మరి!

ఉదయంపూట సాధారణంగా యిద్దరూ కలవటం అరుదుగానే వుండేది. ఆఫీసులో కలిసేవారు. క్యాంటీనులో మధ్యాహ్నం కాఫీ త్రాగేవారు. ఆఫీసులో ఎక్కువ పనివుంటే నీరజ వొకప్పుడు సహాయపడదామని ప్రయత్నించినా రాంబాబు వొప్పుకునేవాడు కాదు.

''నీ కెందుకు నీరజా. అసలే నీరసంగా ఉన్నావు. మిగిలిన పని రేపు నయం చేసుకుంటాను. పద పోదాం'' అంటూ కట్టేసి నీరజతో బయటకు వచ్చేసేవాడు.

నీరజకు శివకుమార్ బెడద తప్పిపోయింది. అతను బొంబాయి నుండి నెలరోజులు లీవు కావాలని టెలిగ్రాం కొట్టటంతో, ఆఫీసులో ఇంకా బాగా పని చేయగలిగే శక్తి సామర్థ్యాలు సిబ్బంది ప్రదర్శించేవారు. నాస్తవానికి శివకుమార్ పోస్ట్, అనవసరమే నన్న అభిప్రాయంలో ఆఫీసర్ రంగనాథన్ పడిపోయారు. ఆ మాటే రాంబాబుతో అన్నారు నవ్వి. రాంబాబు ఏమీ సమాధానం చెప్పలేదు.

సాయంకాలం నీరజ, రాంబాబు హోటలులో కాఫీ త్రాగి ఇంటికి వెళ్లేవారు. అక్కడ వంటలో, పార్వతమ్మగారికి సహాయపడి ఏడు గంటలకు రాంబాబు సహాయంతో రూముకు వచ్చేది.

''ఎందుకు నీరజా! ఇక్కడే భోజనం చేసి రూముకు వెళ్లవచ్చు కదా'' అని రెండు మూడుసార్లు రాంబాబు అన్నాడు.

''వొద్దండీ. ఈ ఇంటి కోడలు నయ్యాకే ఈ ఇంట్లో భోజనం చేస్తాను'' అనేది.

''పోనీ ఈ ఇంటి కోడలువని అమ్మకు, నాన్నకూ చెప్పేస్తాను'' అన్నాడొకనాడు, ప్రాధేయ పడుతూ.

''వొద్దండీ. ఇప్పట్నుండే చెప్పకండి. దేనికయినా సాంప్రదాయం వొకటి వుంది కదండీ. మా వాళ్లు వచ్చి మీ నాన్నగార్ని, అమ్మగార్ని అడుగుతారు, లాంఛన ప్రాయంగా'' అంది.

''చిత్రంగా వుందే! మీ వాళ్లంటే శాంతీ వాళ్లమ్మగారేనా లేక ఇంక ఎవరైనా వున్నారా'' ప్రశ్నించాడు ఆశ్చర్యంగా.

''కొద్దిరోజుల్లో అన్నీ తెలుస్తాయి సార్. తొందర పడకండి'' అంది ముసిముసి నవ్వులతో.

రాంబాబు కేమీ అర్థంకాలేదు. అయినా మరేం ప్రశ్నించలేదు. నీరజ మనస్తత్వం అతనికి బాగా తెలుసు. నీరజ ఆఫీసుకు వెళ్లిన రెండోరోజునో, మూడోరోజునో లలిత కేంపు నుండి తిరిగి వచ్చింది. నీరజ జబ్బు పడటం ఇవన్నీ తెలుసుకుని ఎంతో విచారించింది.

''ఏదో భగవంతుడి దయవల్ల నువ్వు నాకు దక్కావే నీరజా'' అంటూ నీరజను కౌగలించుకుని చిన్నపిల్లలా వలవల ఏడ్చేసింది. అంత బలవత్తరంగా అల్లుకుపోయింది వాళ్లిద్దరి మధ్య స్నేహం.

నీరజ గూడా కన్నీరు పెట్టుకుంది. రాంబాబు అలాగే చూస్తూ నిల్చుండి పోయాడు, వాళ్లిద్దరి అభిమానాన్ని.

కాస్సేపయిన తరువాత కళ్లు తుడుచుకుని

# టమేటోతో కొన్ని రకాలు

## టమేటో ఊరగాయ

కావలసిన వస్తువులు :

టమేటో 1కె.జి., చింతపండు అర కె.జి. మిరప్పొడి 150 గ్రా, ఉప్పు తగినంత, నూనె 150గ్రా, మెంతులు, ఆవాలు అంటేబుల్ స్పూన్, ఇంగువ చిన్న ముక్క.

తయారుచేయు విధానం :

టమేటోలను శుభ్రంగా కడిగి వెడల్పాటి గిన్నెలో రసం పిండి, పై తొక్కను బేసిన్‌లో వేసి సుమారు 5 గంటలసేపు ఎండబెట్టాలి. టమేటో రసంలో చింతపండును నానబెట్టాలి. మెంతులు, ఆవాలు వేయించుకుని, మెత్తగా పొడి చేసి ఉంచుకోవాలి. ఇప్పుడు టమేటో రసంతో నానబెట్టిన చింతపండును (రసంకూడా)రోటిలో వేసి రుబ్బాలి. చింతపండు ముప్పాతిక భాగం రుబ్బిన తర్వాత టమేటో పై తొక్క, ఇంగువ వేసి నున్నగా కాటుకలా రుబ్బుకోవాలి. స్టౌ మీద బాణలి ఉంచి, నూనె, ఆవాలు వేసి, ఆవాలు చిటపటలాడిన పిదప రుబ్బుకున్న చింతపండుముద్దను వేసి చాలాసేపు వేయించాలి. తడిచేతితో టమేటో ఊరగాయను తాకితే అంటకూడదు. అప్పుడు బాణలిని క్రిందకు దించి, మెంతులు, ఆవాలు పొడి చల్లి కలపాలి. ఈ ఊరగాయ 15రోజులు నిలువ వుంటుంది. చపాతీ, పూరీ, ఇడ్లీ, దోసెలకు నంజాకు తినవచ్చు.

## టమేటో దోసెలు

కావలసిన వస్తువులు :

ఉప్పుడిబియ్యం – 500 గ్రా, టమేటో – 250 గ్రా, – జీలకర్ర టేబుల్‌స్పూన్, ఎండు మిర్చి–10, కొబ్బరిచిప్ప–1, ఇంగువ, అల్లం చిన్న ముక్క, కరివేపాకు – ఎండినది, ఉప్పు – తగినంత.

తయారుచేయు విధానం :

ఉప్పుడి బియ్యాన్ని సుమారు 4 గంటల సేపు నీటిలో నానబెట్టాలి. తర్వాత ఉప్పుడి బియ్యం, టమేటో, జీలకర్ర, ఎండు మిర్చి, ఇంగువ, అల్లం, కరివేపాకు, ఉప్పు, కొబ్బరికోరు వీటినంతటినీ రోటిలో వేసి నున్నగా రుబ్బుకొని, ఒక పాత్రలో తీసుకోవాలి. తగినంత నీరు చేర్చి, దోసెపిండిలా కలుపుకుని, దోసెల పెనంలో దోసెలు పోసుకు తింటే చాలా బాగుంటుంది. ఈ టమేటో దోసెలకు గట్టి పెరుగు నంజాకు తింటే మరింత బాగుంటుంది.

## టమేటో అన్నం

కావలసిన వస్తువులు :

బియ్యం అర కె.జి.,టమేటోలు పెద్దవి 8 ఉల్లిపాయలు పెద్దవి 2, పచ్చిమిర్చి 10, మెత్తనిఉప్పు, నూనె 50గ్రా, కరివేపాకురెమ్మ, పచ్చిశెనగపప్పు 2స్పూన్లు.

తయారుచేయు విధానం :

బియ్యం ఉడకబెట్టి అన్నం వార్చుకోవాలి. తడిబట్టమీద అన్నం వేసి చల్లార్చి ఉండలను విడగొట్టాలి. టమేటోలను శుభ్రంగా కడిగి తరగాలి. ఉల్లిపాయలను చక్రాల్లా తరగాలి. పచ్చిమిర్చిని ముక్కలు చేసుకోవాలి. ఇప్పుడు స్టౌ మీద బాణలి ఉంచి నూనె, ఆవాలు వేసి,ఆవాలు చిటపటలాడిన పిదప కరివేపాకు, పచ్చిశెనగపప్పు వేసి దోరగా వేయించి, ఉల్లిపాయ ముక్కలు వేసి బాగా వేయించాలి. తర్వాత టమేటో ముక్కలు వేయాలి. టమేటో ముక్కలు మెత్తగా వేగిన తర్వాత అన్నం, మెత్తని ఉప్పు వేసి 5 నిమిషాల సమయం వేయించాలి.

—కె. జి. హేమలత

---

''రాంబాబుగారూ! ఏ జన్మలోనో మీరు నీరజకు ఋణపడి వుంటారు. మీరే లేకపోతే నీరజఏమయ్యేదో తల్చుకుంటే వొళ్ళు గగుర్పొడుస్తోంది'' అంది భయంగా కళ్ళుమూసుకుంటూ లలిత.

''మీ స్నేహితురాలు, యింకో జన్మలో నా ఋణం తీర్చుకోవటం వాయిదా వేయకుండా, ఈ జన్మలోనే తీర్చేటట్టుగా సలహా యివ్వండి'' అన్నాడు నెమ్మదిగా వాతావరణాన్ని తేలికపరుస్తూ. నీరజ రాంబాబు వేపు చురుగ్గా చూసింది.

''ఆయన ఋణమల్లా ఈ నెలాఖరు తర్వాత తీర్చేస్తానని చెప్పవే లలితా'' అంది చిన్న చిరుకోపం నటించి నీరజ.

''అవును పాపం! చాలా డబ్బు ఖర్చయి వుంటుందే. డబ్బు చాలకపోతే ఈనెల మాకు బోనస్‌లు వస్తాయి. అది గూడా వాడుకో'' అంది లలిత. చాలా కాలంకు కలుసుకున్నారేమో స్నేహితులిద్దరూ మాటల్లో పడిపోయారు.

''ఇంక యిక్కడో మగపురుగు వున్న సంగతి మీ యిద్దరూ గుర్తించడానికి కొంతకాలం పట్టేటట్లుంది. మరి నేనింటికి వెళ్ళొస్తాను'' అన్నాడు రాంబాబు కొంచెం విసుగుతో.

''సారీ!'' అంది నీరజ, అతనివేపు వోరకంట చూస్తూ. ఇలాంటి క్రీగంట చూపులకే మహాఋషులు సహితం కరిగిపోతారు. రాంబాబు అంతకన్నా ఎక్కువ వాడు కాదు.

''సరే. రేపాఫీసులో కలుసుకుందాం! ఇంటి దగ్గర పని వుంది'' అన్నాడు.

''ఆఁ, యేం పని! రాస్తూ కూర్చోవటమేగా. కాస్సేపు కూర్చుందురూ.'' అంది నీరజ గోముగా అతనివేపు చూస్తూ. హద్దులు మీరకపోయినా, లలిత రావటంవాళ్ళిద్దరికీమధ్య కొంచెంయిబ్బందిగానేవుంది.

''నిజమే, మరి. రాసుకోవాలి. మరి పత్రిక

## రాగబంధితులు

వాళ్ళు ముందే చెక్కు పంపించి, నవల రాసి పెట్టమన్నారు. అనుకున్న తేదీకి పంపించాలికదా మరి.''

''ఏ నవల రాస్తున్నారు.''అంది కుతూహలంగా లలిత.

''అంతా సస్పెన్సు. పాఠకులకుగానీ, పాఠకురాండ్రకుగానీ చెప్పకూడదు.''

''నాకూడా చూపించ లేదే లలితా'' అంది. చిరుకోపంతో అతని మీద ఫిర్యాదు చేసింది.

''నీకు గూడా అంటే......'' అంది లలిత.

''అంటే... అంటే... '' నీరజ సమంగా చెప్పలేకపోయింది.

''మరేం లేదు. యిద్దరం కలిసి వొక ఆఫీసులో పని చేస్తున్నాం కదా. అందువలన... ...'' అన్నాడు సర్దేసి.

రాంబాబు వెళ్ళిపోయిన తరువాత,

''లలితా! నీవ్వూరి నుంచి వచ్చేసరికి నీకో మంచి బహుమతి వుంచానే'' అంది నీరజ.

''ఏంటమ్మా అది ?''

''చెప్పకో చూద్దాం.''

లలిత కాస్సేపు ఆలోచించింది. కానీ ఊహకంద లేదు.

''అన్నయ్య నీకుత్తరం రాసాడే''

లలిత బుగ్గల్లో వెచ్చని ఆవిర్లు పొంగాయి.

''ఏమని రాసాడే...'' ... లలిత తడబడుతూ అడిగింది.

''నేను చదివానా యేమిటి? ఆ ప్రేమలేఖ'' అంది నీరజ తెచ్చిపెట్టుకున్న చిరుకోపంతో.

లలితకు ఉత్తరం తీసుకుని ఎంత వేగం గదిలోకి పోయి చదువుకుందామాని వుంది. ఆమె హృదయం ఎంతో ఆనందంతో నిండిపోయి వుంది.

''ఉత్తరం ఇస్తే నాకేమిస్తావ్.''

''నీకేం కావాలే! నా జీవితం అంతా నీ కింద దాస్యం చేసినా నీ రుణం తీర్చుకోలేనే'' అంది లలిత. ఆమె కళ్ళు చెమర్చాయి.

''యూ! సిల్లీ సెంటిమెంటల్ ఫూల్ ...'' అంది ఉత్తరం తెచ్చి ఇస్తూ.

''పోయి గదిలో తలుపు బిడాయించుకొని చదువుకుని కమ్మని కలలు కనవే'' అంది.

రెండురోజులు గడిచాక గానీ లలితకు రాంబాబు, నీరజ కలిసి రావటం, కాస్సేపు ఇంట్లో మాట్లాడుకోవటం, నీరజ కళ్ళలో కొసమెరుపులు, ఇవన్నీ బోధపడినాయి.

''ఏమే నీరజా! ఏమిటి కథ'' అడిగింది నవ్వుతూ. నీరజ సిగ్గుపడిపోయింది. నీరజ విషయంలో లలిత అంచనాలు తారుమారయ్యాయి. నీరజ దిగువ మాధ్యమిక తరగతికి చెందిన అమ్మాయి. ఎన్నో కోరికలు సహజంగా వుంటాయి. మంచి కారు, హోదా, అందమైన ఇల్లుగల మగవాడు భర్తగా కావాలని ఉవ్విళ్ళూరుతారు. శివకుమార్‌ని ఆశించిందేమోననుకుంది, వాళ్ళిద్దరినీ చాలాసార్లు బజార్లో చూసి. కానీ దరిద్రంతో బాధపడుతూ సతమతమవుతున్న రాంబాబును ప్రేమించిందంటే, ఆశ్చర్యంతోబాటు సంతోషం గూడా కల్గింది.

''అతనిలో ఏం చూసి అంతగా ప్రేమిస్తున్నావే ?'' ప్రశ్నించింది లలిత.

''మనస్సును,మనిషిని,వ్యక్తిత్వాన్ని''అందినీరజ.

''అంత గొప్పవాడా ?''

''ఎంతో గొప్పవాడు.''

''అతనితో ఆనందం కన్నా బాధ్యతలు, బాధలు ఎక్కువ అవుతాయేమో!''

''అవనీ! ప్రేమించిన వ్యక్తితో హాలాహలం పంచుకుతాగమన్నాతాగుతాను''అంది ఆవేశంగానీరజ.

''ఏమైనా రచయితగారి సాహచర్యంలో నీకూ కొన్ని ఆశయాలు వంటబట్టాయే'' అంది నవ్వుతూ.

(ఇంకా వుంది)

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను పాపా!
అన్నారు నాన్నారు !!!"

"నిన్నుకాదురా కుర్రకుంకా...
ఆమాట అన్నది అమ్మనురా!"






విజయస్ప్రే. మాంసకృత్తులు. విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలతో సమ్మిళితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణంకాగలదు, సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారుచేయబడింది. విజయస్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయప్రమాణాలకు అనుగుణంగా తయారుచేయబడిన విజయస్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయస్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారు చేయబడింది.

అవును. మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం... విజయస్ప్రే!

# విజయస్ప్రే

కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి
కార్పొరేషన్ లిమిటెడ్ వారి
ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3069A TEL

# ప్రశ్నావళి

**-కె. రామలక్ష్మి**

**జె. బి. ఆర్, పి. యస్. బి. – వేంగలవల్లి**

నాతిచరామి అని ఆడవారిచేత ఎందుకు చెప్పించరు ?

★ స్త్రీ వదిలించుకునే దాకా పట్టుకుని పాకులాడుతుందని – శాస్త్రకారులకి తెలిసిన సంగతే. అందుకే – మగవాడిచేత చెప్పిస్తారు !

**పి. జె. ఎస్. – యస్వి పురం**

ఏనాటికైనా ఏదన్నా అర్థమవుతుంది. కాని పురుషుడు స్త్రీకి అర్థం కాడు ?

★ కాని స్త్రీ పురుషుని మనస్సుని కూడా చెప్పక్కరలేకుండా చదివేయగలదు. అదే ఆడదాని గ్రేట్‌నెస్.

**వెంకటేష్ – ఉరవకొండ**

గంగ, యమున, సరస్వతి … అన్ని నదులనీ స్త్రీలతో పోలుస్తారెందుకు ?

★ చూడముచ్చటగా ప్రవహిస్తాయి. వరదొస్తే, వానొస్తే ముంచేస్తాయి. లోతు తెలియని నీటిమట్టం అమాయకంగా ఆకర్షిస్తూ వుంటుంది … నదుల మూడ్సు పసిగట్టాలంటే స్త్రీల మూడ్సులాగే వుంటాయి. అందుకే కాబోలు కవులు నదులని స్త్రీలతో పోలుస్తారు.

**బి. వి. – పెద్దమందడి**

నా స్నేహితుడు ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆమే ప్రేమించింది. అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారు. ఇద్దరు పెళ్లి చేసుకొంటే పెద్దలు యింట్లోంచి గెంటివేస్తారు. మరి వారికి దిక్కేది ?

★ మీలాంటి స్నేహితులే దిక్కనేమో వాళ్ల ధైర్యం. అందుకే ఆర్థిక స్వాతంత్ర్యం లేని ప్రేమ కుంటిది – అంటే ఇంకొకరి మీద ఆధారపడుతుందని అనడం.

**జె. జీ. జి – యాటగుంటిలి**

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆమె కూడా నన్ను ప్రేమించిందని ఆమె ప్రవర్తనవల్ల భ్రమపడ్డాను. ఇప్పుడామె నాకు ద్రోహం చేసింది. నేను ఏమి చేయాలి ?

★ భ్రమ తొలగిన మనిషి – జ్ఞాని కదా ? నిశ్చింతగా వుండాలి !

**కె బి ఆర్. – వేంగలవల్లి**

ఇద్దరు భార్యలని చేసుకోవడం ఈనాటి భారతదేశ చట్టం ఒప్పుకోదు కదా ? గంగ, పార్వతులని చేసుకొన్న ఈశ్వరుణ్ని, మంగ, పద్మలను చేపట్టిన వెంకన్నను, వేలాదిని చేపట్టిన శ్రీకృష్ణుని పూజిస్తారే ! బహు భార్యాత్వం కల దేవుళ్లని పూజించ కూడదని శాసించరేం ?

★ దేవుళ్లు చరిత్రలోకి రారు ! చరిత్రకి కాలమనేది వుంటుంది !! ఈ పూట బైగమీ చట్టం కింద శ్రీకృష్ణుణ్ని, ఈశ్వరుణ్ని బిగించి కోర్టులో హాజరు పెట్టగలరా ?! కట్టుకథలని చట్టాన్ని కలగాపులగం చేసి మీరు అయోమయంలో పడ్డమే కాదు నన్నూ పడేస్తున్నారు స్వామీ ! కాస్త నిదానంగా ఆలోచించడం అలవరచుకోవాలి.

**జి. ఎల్. – ఆదోని**

స్త్రీల యొక్క మనస్సునందున్న అభిప్రాయాన్ని తెలుసుకొనుట సాధ్యము కాదు అంటాను. తెలుసుకోవడం ఎలా ?

★ ఏం లేదు. 'నేను ఆడదాన్ని అయితే ఎలా ఆలోచిస్తాను ?' అని ఆలోచించండి. అర్థం అయిపోతుంది.

**రవి – ఆదవాని**

స్త్రీలకి వున్న గౌరవం పురుషులకు లేదంటాను. మీరు ఏమంటారు ?

★ గౌరవం నిలబెట్టుకోడం లేదంటా.

**వీర్ – సామర్లకోట**

కె. రా. గారూ ! కులాంతర వివాహాలు సినిమాలలో నవలలో చేయడం తప్ప నిజజీవితంలో ఎందరో అంగీకరించరు. అలాంటి వారిని ఏమనాలి?

★ నిజజీవితంలో సంస్కారాలు సాధించేవాళ్లు ఇల్లెక్కి కూయరు. అందుకే మీకు వినబడడంలేదు.

ప్రేమించిన వ్యక్తి మోసం చేస్తే ఇంకొకర్ని ప్రేమించమన్నారు. ప్రేమించి మోసం చేసిన స్త్రీది తప్పని అనడం మానేసి వెర్రిమొర్రి సమాధానం యివ్వడం సిగ్గుచేటు.

★ అలాగా. మీరు గమనించారో లేదో ప్రేమించి మోసం చేసేది ఆడదేనా ?! అని … ఒకసారి మోసగింపబడినంత మాత్రాన–ప్రపంచానికి ముఖం చూపకూడదా ఎవరూ ?!

**జి. ఎల్. డి. – మచిలీపట్నం**

నాటి ప్రబంధ సాహిత్యంపై మీ అభిప్రాయమేమిటి ? నేడు సాహిత్యం దిగజారిపోయిందని నా నమ్మకం. ఒప్పుకుంటారా ?

★ నేనెవరు ఒప్పుకొందుకు ? మీ గైడే మీకలా చెప్తే అలాగే పలకండి ! అలనాడు అర్థం కాని భాషనీనాడు వీధి మానసి భాషచేసి రాస్తున్నారంతే అనిపిస్తుంది నాకు. మానవ సహజమైన "హిపోక్రసీ" అర్థమయ్యే భాషని పంటికింద రాయిలాగా–అబ్బా ! అనిపిస్తోంది. శ్రీనాధుడు అంటే కవిత్వం, వేటూరి అంటే బూతూ అంటే– ఎలా ? కాలానికి తగి వుంటుంది కవిత్వం. ★

## స్వప్న తరంగం



**— సోమసుందర్**

దరహాసాల్ని బాష్పధారల్ని
కలిపి నేసిన కేన్వాసుపై
ఎవరు శోకించరం వారు ?
ఈ పులు రంగుల చిత్రాన్ని !
వృష్టావృష్టుల పంటల్ని
నష్టాల అష్టకష్టాల్ని
కలిపి నిర్మించిన
ఈ నిర్మల లోగిట్లో –
సౌందర్యాన్నీ వికారాన్నీ
మాధుర్యాన్నీ విషతిక్త సమాహారాన్నీ
నాలుగు కోళ్ళుగా బిగించిన
సంప్రదాయిక పర్యంకంపై
ఆదమరచి సోలిన హృదయంలో
ఎవరు నడిపించారీ
స్వప్న సారస తరంగాల్ని ?
ఈ మహాకాల యవనికపై
పది పదుల జీవితం –
కంటికి కనరాని జీర్ణబిందువు !

ఐతేనేం ? ఎలాంటి మహాద్భుత
అమృత భాండాల్ని అందించగలమూ ?
ఎంతటి మనస్సరోవర కంజాతాల
సృజించగలదీ అల్పజీవితం !

* * *

ప్రతి సాయంత్రమూ
కొండ చెరియ వక్షంపై
ఏటవాలుగా వాలిన నీరెండ
ఎంత ఆప్యాయంగా చెప్పుకుంటుంది
తన యౌవన గాథల మౌనవేదనలు !
గతానేక స్మృతులు…
ఆశాస్వప్న తరంగాలు…
చిరంజీవి బాలకునివలె
నిలచిన కొబ్బరిచెట్టు
నిరంతరం స్వప్న బలాకల
విశాల గగనాల కెగిరేస్తుంది !
వెర్రి ఆనందంతో చేరులూపుతూ
ఏ ఆగామి నవోదయాలను
ఆయత్త పరచేందుకో తొందర !

* * *

ఏ ప్రత్యూష మురళీనాదంలో
నిద్రాలస మరుత్తుల
మత్తుమడతల నొత్తుకుంటూ లేచి
ఏ పులింద పులిన సీమల
విహరిద్దామనో ఆతుర్దా ?
ఎందుకీ నారికేళానికీ ఆవేశం ?
ఏ మానవ విజయోత్సవ నాదాల
సంగీత లహరుల గ్రోలుదామనో…
ఏ సంగమ బృందగానాల నాలిద్దామనో…
మమికే ఈ కొండవాగుల
అవిశ్రాంత దీక్షా విర్భూతి
ఏ కర్మణ్యత్వాల సమష్టి సౌభాగ్యాలకోసమో…
ఓహో స్వప్నతరంగమా,
మరోసారి సాక్షాత్కరింపచేయవా,
నీ ఆశామయూరీ సహస్రాక్షుల్ని !
నా చిరంతన తపో ఫలశ్రుతుల్ని !

# జయసుధ సహజమైన అందాన్ని మరింత చేసేది లక్స్




సహజమైన తన చర్మ సౌందర్యానికి మెరుగులు దిద్దుకునేందుకు జయసుధ వాడేది లక్స్ మాత్రమే.

"నా చర్మ సౌందర్యాన్ని మరింత మృదువుగా, అందంగా రూపొందిస్తున్నది లక్స్" అంటుంది జయసుధ.

Jaya Sudha

**శుద్ధమైన, సౌమ్యమైన లక్స్— సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన




**'తాతయ్యా !' అన్న పిలుపు వినగానే గోపయ్య మెల్లగా కళ్లు విప్పాడు. ఎదురుగా గంగ కన్పించింది. నీలం రంగు లంగామీద గులాబి రంగు జాకెట్టు వేసుకొంది.**

చెవులకు వ్రేలాడుతున్న రోల్డ్‌గోల్డ్ రింగులు, ముందుకు వేసుకొన్న జడ, ఆ జడలోని ముద్దబంతులు, మెళ్లో వున్న పూసల పతకం — గంగ శరీరానికి మరింత నిండుదనాన్నిచ్చాయి. గంగను చూస్తుంటే ఛెంగు ఛెంగున గెంతే లేగదూడ గుర్తుకు వచ్చింది గోపయ్యకు. నిగనిగలాడే బుగ్గలు, చక్రాల్లాంటి కళ్లు, పల్చటి పెదాలు ఎంతో ముద్దు రాగా గోపయ్య ఉత్సాహంగా మంచమ్మీదినుంచి లేవబోయాడు. కాని అంతలోనే కాలు, చెయ్యి అభ్యంతరం చెప్పాయి. తన పరిస్థితికి కన్నీరు కార్చాడు గోపయ్య. గంగను దగ్గరకు తీసుకొన్నాడు. గోపయ్య ముఖంలోకి చూస్తూ అడిగింది గంగ 'తాతయ్యా! టీ తాగావా ?' అని.

ఆ ప్రశ్న వినగానే గోపయ్య గుండె ఝల్లుమంది.

మనసు గతంలోకి పరిగెత్తింది.

* * *

గోధూళివేళ.

శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో భక్తులు క్రమేపీ పెరిగారు. కొంతమంది అడ్డదార్లవెంట లోపలికి వెళ్లటానికి ప్రయత్నిస్తున్నారు. డ్యూటీ దిగిన గోపయ్య భుజాన వున్న బెల్టును తీసి మడతపెట్టి చేత్తో పుచ్చుకొన్నాడు.

'ఏం బావా! కాంటీన్‌కెళ్లి టీ తాగొద్దామా ?' భుజమ్మీద చేయి వేసి అడిగాడు తోటి బంట్రోతు రాములు.

'నే రాలేనోయ్ !'

'అదేమిటోయ్ ! కొత్తగా మాటాడుతున్నావ్ ! బిల్లు నేనే యిస్తాలే ?' గర్వంగా అన్నాడు రాములు.

'ఇవ్వాళ ఏమాత్రం సంపాయించావేమిటి?'

'ఆ ఏడుకొండలవాడు సల్లగా వుండాలేకాని మనకు కరువేంటి బావా ?'

'చేస్తున్న పాపానికి ముందు ముందు ఫలితం అనుభవించాలన్న విషయం గుర్తుంచుకో !'

'పిచ్చోడా! పాపం అని మడికట్టుక్కూర్చుంటున్నావు కాబట్టే వాళ్లిచ్చే జీతం రాళ్లతో బతుకుతున్నావు. నీకేదో ఆ పాల వ్యాపారం వుంది కాబట్టి సరిపోయింది. మరి నాలాంటోడికి ఆ జీతం రాళ్లు ఏం చాలుతాయి ?'

'అవునుమరి రెండు సంసారాలుగా !'

'నెమ్మదిగా అను బావా! ఎవరైనా వినగలరు !'

'చేస్తున్న పనికి సిగ్గులేనప్పుడు ఎవరో వింటారని భయమెందుకయ్యా! దేవతలాంటి యిల్లాలుండగా ఆ నాంచారమ్మ యింటికి పోతావెందుకు ?'

'బావోయ్! కళ్లు పోతాయ్ జాగర్త ! ఆ ఏడుకొండలవాడు, నిన్ను శపిస్తాడు. ఆడిక్కూడా నాంచారమ్మ వుంది సుమా !'

'వెర్రిరాములూ, ఆ స్వామికి నీకు పోలికా? నీవు చేస్తున్న పనికి ఆయన క్షమిస్తాడా ?'

'ఏం నేనేం తప్పు చేస్తున్నాను. భక్తులు అర్జంటుగా దేవుణ్ణి చూసే ఏర్పాటు చేస్తున్నాను.'

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంవిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా చొచ్చుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

## పరమాణు యుగానికి తగిన దేవుడు

# అమెరికాలో "శివదర్శనం"

గత మాసాంతంలో అమెరికన్ ప్రాచీన రాజధానీ నగరమైన ఫిలడెల్ఫియాలో "శివుడు ప్రత్యక్షమైనాడు". "శివరూపాలు" అనే అపూర్వ కళా ప్రదర్శనం ఒకటి మార్చి 29న ఆ నగరంలోని ఫిలడెల్ఫియా మ్యూజియమ్ ఆఫ్ ఆర్ట్సులో ప్రారంభమైంది.

ఈ ప్రదర్శనలో సుమారు 200 దాకా ప్రాచీన భారతీయ చిత్రాలు, రాతి, కాంశ్య శిల్పాలు ఉన్నాయి. వీటిలో అతి ప్రాచీనమైనవి, దాదాపు 2000 సంవత్సరాల నాటివి కూడా ఉన్నాయి.

ఈ ప్రదర్శనాన్ని కూర్చినవారు డాక్టర్ స్టెలా క్రామ్‌రిష్. ఇండియాలో వివిధ ప్రాంతాల నుంచి, పురావస్తు ప్రాముఖ్యత గల ప్రదేశాల నుంచి, అమెరికా, ఐరోపా దేశాలలోని ప్రసిద్ధ మ్యూజియమ్‌ల నుంచి సంవత్సరాల తరబడి శ్రమించి సేకరించిన కళాఖండాలివి. శివుని విభిన్న రూపాలకు, శైవ సిద్ధాంతానికి ప్రాతినిధ్యం వహించే కళారూపాలివి.

"ఈ ప్రదర్శనంలోని శివుని వివిధ రూపాలను సందర్శించినప్పుడు ప్రేక్షకునికి ఒక అపూర్వానుభూతి కలుగుతుంది. శివుడంటే ఏమిటి? శైవం అనగా ఏమిటి? అనే నిగూఢ ప్రశ్నలకు జవాబు పొందటానికి వీలు కల్పించే ప్రదర్శనమిది. శైవ తత్వం విశ్వజనీనమైనదన్న భావన, ఈ కళాఖండాలను నిశితంగా పరిశీలించినప్పుడు, కలుగకమానదు" అని డాక్టర్ క్రామ్‌రిష్ అంటారు.

"నేటి పరమాణు యుగానికి తగిన దేముడు ఎవరైనా ఉన్నాడంటే, ఆ దేముడు శివుడే. శివతాండవం నేటి యుగానికి తగినది. శివతాండవంలో క్షయంతోపాటు తుల్యత ఉన్నది, యమకం ఉన్నది — ఈ రెండు లక్షణాలను సృష్టికి, జీవితానికి పోల్చవచ్చు" అని అమెరికాలో భారత రాయబారి శ్రీ నారాయణ్ అన్నారు.

ఈ మ్యూజియమ్‌లో "శివదర్శనం" ప్రదర్శనతోపాటు, మరి ఎనిమిది ఫిలడెల్ఫియా సాంస్కృతిక సంస్థలు భారతీయ కళా సంస్కృతులకు సంబంధించిన ఉత్సవాలు నిర్వహించబోతున్నాయని ఆ నగర మేయరు విలియమ్ జె. గ్రీన్ చెప్పారు. ఇండో — అమెరికన్ ఉప సంఘ కృషి ఫలితంగా అమెరికన్ సమకాలీన కళాఖండాలు ఇండియాలో ప్రదర్శించబడుతున్నట్లు ఆయన చెప్పారు.

"భారతదేశం ఒక మహోన్నతమైన ప్రాచీన సంస్కృతీ నిలయం. అందుకు భిన్నమైన సంప్రదాయంలో అభివృద్ధి చెందిన మాకు భారతీయ సంస్కృతి, ఇతిహాసాలను గురించి తెలుసుకోగల అవకాశం, ఈ గొప్ప ప్రదర్శన ద్వారా లభించింది" అన్నారు మేయరు గ్రీన్.

ఈ ప్రదర్శన ప్రారంభోత్సవ కార్యక్రమంలో ప్రస్తుతం కాలిఫోర్నియాలో ఉంటున్న విజయ ప్రకాష్ కన్నుల విందుగా భరతనాట్యం చేశారు.

28వ తేదీ ప్రివ్యూ సందర్భంలో కూచిపూడి, ఒడిస్సీ నృత్యాలు ఏర్పాటు చేశారు. రీతాదేవి ఈ నృత్యాలు చేసి సదస్యుల మన్ననలు పొందారు. విమల రాజగోపాల్ దక్షిణ భారత జానపదగేయాలు పాడారు. అక్కడి స్థానిక భారతీయ బృందాలవారు వివిధ రకాల బృంద నృత్యాలు జరిపారు. ఈ ప్రదర్శన తొలిరోజు 5500 మంది ప్రజలు వచ్చి చూచారు. ఫిలడెల్ఫియా టెలివిషన్ కేంద్రం ఈ ప్రారంభోత్సవంపై అరగంట కార్యక్రమం ప్రసారం చేసింది. దీని తరువాత ఈ కేంద్రం మాల్కన్‌లే నిర్మించిన ఇండియా గురించిన ఒక వార్తా చిత్రాన్ని కూడా ప్రసారం చేసింది.

"భారత వర్షం — బహుముఖాలు — బహురీతులు" అనే పెద్ద కార్యక్రమాన్ని ఫిలడెల్ఫియాలోని అయిదు సాంస్కృతిక సంస్థలు నిర్వహించాయి.

— ఆర్. ఆర్. బర్తా

# పాడి ఆవు

'మరి వాళ్లదగ్గర లంచంగా అయిదులు, పదులు తీసుకోటం తప్పుకాదా?'

'ఓపికున్నప్పుడు, అవకాశం వచ్చినప్పుడు సంపాదించకపోతే మరెప్పుడు సంపాయిస్తాము బావా? నిన్నగాక మొన్న కొత్త కోడలొచ్చింది నీకు. ఏదో నాల్రోజులుబాగా చూస్తది. కాని ఎల్లకాలం ఆళ్లకు నీ మీద ప్రేమలుంటాయను కొన్నావా?'

ఇద్దరూ నడ్చుకొంటూ రోడ్డుమీదికి వచ్చారు.

'నీకు తెలీదు రాములూ! నా కొడుకు శ్రీరాముడిలాంటివాడు. నా కోడలు సీతమ్మ తల్లి. నా కోడలు పరాయిది కాదు. నా సొంత మేనకోడలు. చిన్నప్పుడే దాని తల్లి చచ్చిపోయింది. దాన్ని న కోడల్ని చేసుకుంటానని మాటిచ్చాను. అలానే చేసుకున్నాను. ఈనాడు నీతో టీకి రానంటున్నాను. ఎందుకోతెలుసా? మా కోడలు నేను వెళ్ళేసరికి వేడి వేడి టీ కాసి నాకు యిస్తది. నేనంటే దానికెంతో అభిమానం!'

'అదృష్టవంతుడివి! మా టల్లో పడి కాంటీన్ దగ్గరకొచ్చాం. నీ వెళ్లి నీ కోడలి దగ్గరే టీ తాగు! ఇదెంత కాలమో చూస్తాగా!' ఎగతాళిగా నవ్వాడు రాములు.

'పిచ్చివాడు!' అనుకొంటూ ఇంటికి వెళ్ళాడు తను.

తను వెళ్లేసరికి కాళ్లు కడుక్కోటానికి నీళ్లిచ్చి తుండు చేతికిచ్చేది కోడలు. తను కాళ్లు కడుక్కొని బట్టలు మార్చుకొనేసరికి వరండాలో వాలు కుర్చీ వేసేది. ఇంట్లోకి వెళ్లి గబగబ వచ్చి వేడి వేడి టీ తనకు అందించేది.

'నువ్వొచ్చాక ఈ టీ వొకటి అలవాటయిందమ్మా!' అని తనంటే —

'అదేంటి మామయ్యా! మీరు పగలంతా పనిచేసి అలసిపోతారు. ఓ కప్పు టీ కూడా తాగకపోతే ఎలా?' అనేది.

'మీ అత్తయ్య చాలా దురదృష్టవంతురాలమ్మా!'

'ఏంటి మామయ్యా నీవనేది?'

'అవునమ్మా! కోడలిచేత సేవలు చేయించుకోలేకపోయిందది!'

'అత్తయ్యకు సేవచేసే భాగ్యం నాకే కల్గలేదు. నేనే దురదృష్టవంతురాల్ని మామయ్యా!' అని కళ్లనీళ్లు పెట్టుకొనేది జయమ్మ.

అలాంటి జయమ్మ ఎంతమారిపోయింది?!

ఈ మార్పుకు కారణం ఏమిటి?

తన దురదృష్టమా? లేక కాలమహిమా?

"ఏంటి? పండుకొన్నావా?" జయమ్మ అరుపు విన్పించగానే ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు గోపయ్య.

"టీ తెమ్మని గంగకు చెప్పావా?" కోపంగా అడిగింది.

"లేదమ్మా! నేను చెప్పలేదు. నాకెందుకు టీ?" మెల్లగా గొణిగాడు గోపయ్య.

"డాక్టర్‌గారు టీ యివ్వద్దని చెప్పాడు అంతేకాని నీకు యిస్తే మా ఆస్తులు తరుగుతాయని భయపడి కాదు, నీకు టీ ఇవ్వటం మానేసింది!"

"అక్కర్లేదమ్మా! ఏదో చంటిపిల్ల కదా! నా మీద ప్రేమకొద్దీ టీ యిద్దామనుకొంది.. అలా చేయవద్దని కేకలేస్తాలే!"

"ఆహాహా! ఎంత చమత్కారం! అక్కడికి దానికి ఒక్కదానికే నీ మీద ప్రేమ వున్నట్లు మా కెవ్వరికీ లేనట్లా? మీ అబ్బాయి మంచోడు కాబట్టి డాక్టర్‌కు బోలెడంత

క్రొత్త

# సంసార్

డిటర్జెంట్ ఉతికే పౌడర్

# "వ్యత్యాసమేమి?" పోటీలో పాల్గొనండి

అన్ని సమాధానములు సరిగ్గా ఉన్న మొదటి 15,000 ప్రవేశ పత్రాలకు విశేష డిస్కౌంట్ కూపన్‌లు లభిస్తాయి

పాలిప్యాక్‌లో లభించే క్రొత్త సంసార్ డిటర్జెంట్ ఉతికే పౌడరు అమ్మకం ధర కే.జి.కి రూ. 12.50 (పన్నులు అదనము). కాని 'ప్రత్యేక పరిచయాత్మకం' ద్వారా మీరు సంసార్‌ను రూ. 9.50 కే (పన్నులు అదనము) పొందవచ్చును. మీరు చేయవలసిందల్లా ఈ పోటీలో పాల్గొని డిస్కౌంట్ కూపన్‌ను పొందటమే! ఈ ఉత్తమ సంసార్ డిటర్జెంట్ మీ సొమ్ముకి సరిపడు గుణాన్ని కల్గివుందని మీరే నిర్ణయించండి.










క్రింది ప్రశ్నకు మీ సమాధానము వ్రాయండి.

సంసార్ పాలిప్యాక్ మీద ఎన్నిరంగులు కలవు ?

పోటీ చాలా సులభం
ప్రవేశ రుసుము లేదు.

Sansar (A)
DETERGENT WASHING POWDER
THE FAMILY ECONOMY PACK
MAXIMUM CONSUMER PRICE Rs. 12 50 (LOCAL TAXES EXTRA)
1kg Net weight
MANUFACTURED BY KARNATAKA SOAPS AND DETERGENTS LIMITED BANGALORE 560 055

Sansar (B)
DETERGENT VASHING POWDER
THE ECONOMY FAMILY PACK
MAXIMUM CONSUMER PRICE Rs. 12 50 (LOCAL TAXES EXTRA)
1k Net weight
MANUFACTURED BY KARNATAKA SOAPS AND DETERGENTS LIMITED BANGALORE 560 055

పైన చూపిన రెండు ప్యాక్‌ల మధ్య 6 తేడాలు కలవు. ప్యాక్ 'ఎ' మాత్రమే సరియైన ప్యాక్. ప్యాక్ 'బి' మీద తప్పులను ఎంచి చుట్టూ వృత్తాకారం గీయండి. ఈ ప్రవేశ పత్రాన్ని కత్తిరించి, మీ పేరు మరియు విలాసమును ప్రత్యేక కాగితంమీద వ్రాసి క్రింద పేర్కొన్న చిరునామాకు పంపించండి.
'వ్యత్యాసమేమి' పోటీ, మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్
36, కన్నింగ్‌హ్యామ్ రోడ్డు, బెంగళూరు–560052.
న్యాయ నిర్ణతల తీర్పు తుదినిర్ణయము మరియు దీనికి సంబంధించిన ఏ విధమయిన ఉత్తర ప్రత్యుత్తరములకు అవకాశము ఇవ్వబడదు.
ప్రతి కుటుంబానికి ఒకే ప్రవేశ పత్రము.

త్వర పడండి
ఈ రోజే పాల్గొనండి.

ASVP

కర్నాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగళూరు వారి ఒక నాణ్యమైన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు: మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగళూరు

MCA-SDP-101 TEL

తగలేసి నీ రోగానికి మందులిప్పిస్తున్నాడు. ఆ మాత్రం మనుష్యుల్ని అర్థం చేసుకొనే జ్ఞానం కూడా లేకపోతే ఎలా ?'' అంటూ రుసరుసలాడుతూ లోపలికి వెళ్లింది జయమ్మ.

'నీ మొగుడు ఎవరి డబ్బో వాకు ఖర్చు పెట్టడంలేదే ! నేను సంపాదించుకొన్న ఆస్తినే నేను తింటున్నాను. ఒక ఆవుతో వుండే ఇంటిని పది ఆవుల పాడిచేయటానికి కారణం నా రెక్కల కష్టమేనే !' బిగ్గరగా అరవాలనుకొన్నాడు గోపయ్య. కాని జయమ్మ నోటికి భయపడి ఆ ప్రయత్నం మాను కొన్నాడు.

# పాడి ఆవు




ఈనాడు సీతయ్య ఓ మనిషిగా నిలబడ్డాడంటే అందుక్కారణం తనే. చిన్నప్పట్నుంచీ వాడికి చదువుమీద శ్రద్ధ వుండేది కాదు. ఏ మాత్రం డబ్బులున్నా తిరుపతెళ్లి సిన్మాలు చూసొచ్చేవోడు. అతి కష్టమ్మీద ఎనిమిదో క్లాసు వరకు చదివాడు. పోనీ పాలవ్యాపారంలో పెడదామంటే శరీర కష్టం పడలేనివాడు. ఓ ప్రక్క బంట్రోతు వుద్యోగం చేస్తూ సంసారాన్ని ఈదుకొస్తూ, ఓ ఆవునుకొన్నాడు తను. గొడ్డొచ్చిన వేళ, బిడ్డొచ్చిన వేళ అంటారు. లక్ష్మి నిజంగా ఆవు కాదు. తన పాలిట దేవత. అది వచ్చాక తనకు బాగా కల్సివచ్చింది. దాని పాలమీద వచ్చిన డబ్బును బ్యాంకులో దాచి మరో రెండు ఆవులను కొన్నాడు. అలా అలా కూడబెట్టిన సొమ్మును పెట్టి తను ఆవులను కొన్నాడు. కోడలు వచ్చేసరికి తమింట్లో పది ఆవులపాడి వుండేది. కోడలు కూడా ఆవులను జాగ్రత్తగా చూసుకొనేది. సీతయ్య మాత్రం ఇంటి పని ముట్టుకొనేవాడు కాదు. వాడికేదైనా వుద్యోగం చూడాలను కొంటున్న సమయంలో తనకీ పాడు జబ్బు వచ్చి మూలపడ్డాడు. తన వుద్యోగం సీతయ్య కిచ్చారు. తను మూలపడ్డాక సంసారంలో రకరకాల మార్పులు వచ్చాయి. కొడుకు, కోడలు యింతకుముందులా తనతో మాట్లాడటంలేదు. తన విషయం వచ్చేసరికి చిరాకుపడిపోతున్నారు. తను మాట్లాడు తుంటేనే ఖస్సుమంటున్నారు. పట్టెడన్నం పెట్టడమే వాళ్ల కెంతో బాధగా వుంది. నిజంగా దేవుడనేవాడు వున్నాడు కాబట్టే పక్షవాతం వచ్చినా తను పూర్తిగా మంచంపాలు కాలేదు. కర్ర వూతతో మెల్లగా తిరిగే స్థితిలోనే వున్నాడు. తను పుణ్యం చేసుకో బట్టే గంగలాంటి మనవరాలు దొరికింది.

"తాతయ్యా ! ఇదిగో టీ !'' అంటూ గంగ టీ కప్పు అందించేసరికి తన ఆలోచనలను కట్టిపెట్టి కన్నీళ్లతో—

"వద్దమ్మా ! మీ అమ్మ తాగవద్దంటోంది !'' అన్నాడు గోపయ్య.

''అమ్మే పంపించింది. తాగు తాతయ్యా!'' అంటూ టీ కప్పును గోపయ్య నోటికి అందించింది గంగ.

మెల్లగా లేచి కూర్చుని కప్పును అందుకొన్నాడు.

గోపయ్య టీ త్రాగుతుంటే ఎంతో తృప్తిగా చూసింది గంగ.

''టీ బాగుందా తాతయ్యా ?''

''చాలా బాగుందమ్మా ! నీ చేత్తో యిచ్చావుగా మరి ! అవును ! నువ్వు టీ తాగావా ?''

"లేదు తాతయ్యా ! నేనే తాగుతానని అమ్మతో అబద్ధం చెప్పి ఈ టీ తెచ్చాను.''

గంగ అలా అనేసరికి గోపయ్య గుండె ఝల్లుమంది.

ఖాళీ చేసిన కప్పును ప్రక్కనపెట్టి గంగమ్మను ఒడిలోకి తీసుకొని "నా బంగారు తల్లి !'' అంటూ ముద్దులతో నింపాడు.

* * *

ఆ రాత్రి గోపయ్యకు నిద్ర పట్టలేదు.

కనీసం ఓ కప్పు టీ క్కూడా నోచుకోలేని తన బ్రతుకు వ్యర్థమన్పించింది.

తనకీ జబ్బు లేకపోతే తన వుద్యోగం పోయేదికాదు.

తన కోడలు తనకు ఎన్నో మర్యాదలు చేసేది.

తన బ్రతుకు మరో రకంగా వుండేది.

తనలాంటి స్థితి పగివాడిక్కూడా వద్దు !

రెండు చేతులతో దణ్ణంపెడుతూ ఇంటి కప్పువైపు చూస్తూ ఉండిపోయాడు గోపయ్య.

అప్పటికి బాగా ప్రొద్దుబోయింది.

ప్రక్క గదిలోంచి సన్నగా మాటలు విన్పించాయి గోపయ్యకు. కోడలు కొంచెం విసురుగా మాట్లాడుతోందని గ్రహించిన గోపయ్య మెల్లగా గది ప్రక్కకు తిరిగి కిటికీ వద్ద తలపెట్టాడు

''నువ్వెన్నయినా చెప్పు ! మా నాన్న యిక్కడకు రావాల్సిందే ! ఈ గొడ్ల చాకిరీని నేనొక్కదాన్నే చేయలేకపోతున్నాను. అవతల మీ నాన్నేమో మంచానపడ్డాడు. ఈ చాకిరీ నేను చేయలేను!'' గట్టిగా చెప్తూంది కోడలు.

''పోనీలేవే ! పాలేరును పెట్టుకొందాములే !'' నచ్చజెప్తున్నాడు కొడుకు.

''మళ్లీ వాడిక్కూడా తిండి దండుగ. మా నాన్నకు మాత్రం ఎవరున్నారు ? మా వూళ్లో ఒంటరిగా వుండటంకంటె యిక్కడకు వచ్చి మనకు చేదోడువాదోడుగా వుంటే నయం కదూ !''

# మనోహరమైన సరికొత్త రూపంలో...

PONDS VANISHING CREAM

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్




బయటకు సన్నగా కనిపిస్తే లోపల తక్కువ క్రీమ్ వున్నట్లు అర్థంకాదు. 70 గ్రాం, 40 గ్రాం. 20 గ్రాం సైజ్‌లలో జాడీలు వస్తున్నాయి. అందమైన అట్టపెట్టెలో వస్తున్న ఈ జాడీలు విరగవు మరియు తేలికయినవి.

మీ చర్మాన్ని ఎప్పుడు మృదువుగానూ, నున్నగానూ, తాజాగాను వుంచేటట్లు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ అందించే వాగ్దానం. అది ఎప్పుడు కాపాడుతున్నది.




* కొన్ని ప్రదేశాలలో మాత్రమే లభిస్తుంది.

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్

HTM-PIL-2474

# పాడి ఆవు

"బాగానే వుంటుంది. కాని మన యిల్లు మూస్తే యిరుకు కదా! ఎండాకాలం ఎట్లా సర్దుకుపోయినా వానాకాలం కష్టం కదా!"

"కష్టమేముంది? ఆ వరండాలోనే వుంటాడు!"

"మరి మా నాన్న!"

"పొద్దున్నే లేవగానే పెద్దావు ముఖం చూడాలంటాడుగా! దాని పక్కనే మంచం వేద్దాం!"

"ఏమిటి గొడ్లసావిట్లోనా?"

"ఏం? అది మాత్రం మన యిల్లు కాదా! కళ్ళు మూసుకొని పండుకొనేవాడికి గొడ్లపాకయినా ఒకటే డాబా యిల్లయినా ఒకటే!"

"చాల్లే! పిచ్చి పిచ్చిగా వాగకు! నాన్న వింటే బాధపడ్తాడు. కళ్లు మూసుకొని పండుకో!"

"అలాగే పండుకొంటా కాని మా నాన్నను రమ్మని రేపు వుత్తరం రాస్తావా?"

"చూద్దాంలే!"

గోపయ్య కళ్లల్లో ఉప్పెన!

గోపయ్య గుండెల్లో భూకంపం!

ప్రపంచమంతా తనను శత్రువులా చూస్తున్నట్లు ఫీలయ్యాడు. గొడ్లపాకలో పండుకోటం తనకు చిన్నతనం కాదు. మనసుల్లేని ఈ మనుషుల మధ్య మసలేకంటే మమతలు చూపే ఆ మూగజీవుల మధ్య జీవించటంలో తృప్తి వుంది. అయితే ఒకప్పుడు ఎంతో బాగా బ్రతికిన తను ఈనాడు గొడ్లపాకలో గతిలేక కాపురం చేయాలా? తనకంటే తన వియ్యంకుడు ముఖ్యమా? అవును మరి! తన పరిస్థితే తన దురదృష్టానికి కారణం! ముందు వచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడిగానే వుంటాయి. ఆ గొడ్లపాకలో నికృష్టంగా బ్రతికేకంటె కొంచెం విషం మింగి చావటం మేలు. కనీసం తన కొడుక్కయినా తనంటె జాలి లేదా? ఈ ఘోరాన్ని ఆపలేడా? పెళ్లాం మాటలు విని తనను గొడ్లపాకలోకి వెళ్ల గొడ్తాడా? వీల్లేదు ... వీల్లేదు ... అలా జరగటానికి వీల్లేదు. ఆలోచిస్తూనే నిద్ర పోయాడు గోపయ్య.

* * *

తెల్లవారింది.

ఇల్లంతా ఎంతో సందడిగా వుంది.

ఈ రోజు కృష్ణాష్టమి!

జయమ్మ పొద్దున్నేలేచి ఆవులన్నింటికీ ఒళ్లురుద్ది నీళ్లపోసి పసుపు కుంకుమలతో అలంకరించింది. రంగు రంగుల పూలను మాలలుగా కట్టి కొమ్ములకు చుట్టింది.

ఈ పండుగను తల్చుకొంటే పాత రోజులు గుర్తుకొచ్చాయి గోపయ్యకు. తనెంతో సరదాగా యీ పండుగ చేసేవాడు. బజార్లో రంగు డబ్బాలు కొనుక్కొచ్చి ఆవులకొమ్ములకు రంగులు వేసేవాడు తను. ప్రతి ఆవు ముఖాన పసుపు పూసి కుంకుమ బొట్టు పెట్టేవాడు. దేవుడి గుడిచుట్టూ తిప్పి గులాం చల్లి ఇంటికి తోలుకువచ్చేవాడు. కోడలు ఆ రోజు పాయసం చేసి దేవుడికి ఆరగింపు పెట్టి ముందుగా తనకే వడ్డించేది.

అలాంటి పండుగ ఈనాడు ఎంతో చప్పగా వున్నట్లుంది తనకు. తను ఓపిక చేసుకొని ఆవుల నుదుట కుంకుమదిద్దటానికి సిద్ధపడినా కోడలు అందుకు ఒప్పుకోదు. తన నీడంటేనే మండిపడుతూంది. ఈ ఇంట్లో తనిప్పుడు పెద్ద అడ్డుగోడలా వున్నాడు.

గంగ పరుగు పరుగున రావటంతో గోపయ్య తలెత్తి చూశాడు.

"తాతయ్యా! ఇలారా ఓసారి!" హడావుడిగా అంది.

"ఎందుకమ్మా?" మెల్లగా అడిగాడు గోపయ్య.

"రా తాతయ్యా! చెబుతాగా!" అంటూ కర్ర అందించింది. కర్రసాయంతో గోడను ఆసరాగా తీసుకొని మెల్లగా గంగ వెంట ప్రక్క గదిలోకి వెళ్లాడు.

"బీరువా పైన పసుపు డబ్బా, కుంకుమ డబ్బా వుంది తాతయ్యా! అవి రెండూ అందుకొని నా కివ్వు!" అంది గంగ పైకి చూపిస్తూ.

చేతులతో తడిమి రెండు డబ్బాలను తీసి గంగకు అందించాడు.

"ఇవి నీ కెందుకమ్మా?" ఆశ్చర్యంగా అడిగాడు గోపయ్య.

"చూడు తాతయ్యా! మరి అమ్మ ఏం చేసిందో?"

"ఏం చేసిందమ్మా?"

"ఈ రోజు పండగ్గదా! ఆవులన్నింటికీ పసుపు రాసి కుంకుమ పెట్టింది. కాని పెద్దావుకు మాత్రం ఏమీ చేయలేదు. అసలు దానికి తెలగపిండి, తౌడు కూడా పెట్టడంలేదు తాతయ్యా! పాపం! పెద్దావు కాళ్లు పడిపోయి పాకలో కదల్లేక పండుకొంది తాతయ్యా!" జాలిగా చూసింది గంగ.

"రేపో మాపో చచ్చేదానికి దానికెందుకమ్మా పసుపు కుంకుమ" విరక్తిగా నవ్వాడు గోపయ్య.

"తాతయ్యా! పాపం! పెద్దావుకు ఎంత ఆకలేస్తోందో?"

"దాని ఆకలి అందరికీ అర్థంకాదమ్మా! అది పాడి ఆవు కాదుగా!" అంటూ బయటకు రాబోయిన గోపయ్యకు ఎదురుగా గుమ్మంలో జయమ్మ కన్పించేసరికి తల వంచుకొని వరండాలోకి వెళ్లిపోయాడు.

గోపయ్య వెళ్లిన దిక్కే జయమ్మ చూస్తూండిపోయింది.



ఇదుగో...

# వజ్రంలాంటి అంచుగల
## వాడైన బ్లేడు









అత్యుత్తమమైన స్టెయిన్‌లెస్ స్టీల్ తీసుకున్నాం...దాన్ని పదును పెట్టాం, అరగదీశాం, సానపట్టాం, మెరుగు పెట్టాం—అయినా మాకు తృప్తి కలిగిందా అంటే లేదు. అందుకే, అంచుమీద వాక్యూమ్ స్థితిలో అతిసూక్ష్మ లోహ రేణువులను శక్తివంతంగా స్ప్రే చేసాం, టెఫ్లాన్ పూత వేశాం; ఆ విధంగా ఓ రత్నాన్నే సృష్టించాం—'వజ్రం లాంటి అంచుగల' వాడైన బ్లేడు.

కొత్త ఇరాస్మిక్ స్టెయిన్‌లెస్ సుప్రీమ్-మీ ముఖానికి అర్థమైంది ఇదే !

# ఇరాస్మిక్
స్టెయిన్‌లెస్
# సుప్రీమ్

**సాంకేతిక ప్రావీణ్యం మరి ఇరాస్మిక్, సుఖమైన షేవ్ ఇది సుప్రీమ్!**

లింటాస్-SHP. ESP. 4-2315 TL

# ఇప్పుడు 20 పై. తగ్గింపుతో అందుకోండి

# ట్రిలో

ఇప్పటికే ఇతర వాటికన్న 25% తక్కువ ఖరీదైన నీలి డిటర్జెంట్ బిళ్ళ!

ట్రిలోతో వచ్చే నురుగు ఎక్కువ—గనక మీరు మరెన్నో బట్టల్ని ఉతికే వీలు. మరే యితర డిటర్జెంట్ బిళ్ళతో కన్న మరింత ఎక్కువగా!



ట్రిలో ఎంతో బాగా శుభ్ర పరుస్తుంది—బాగా మురికి పట్టేసిన మీ బట్టల్ని కూడా శుభ్రపరచగల శక్తిగలది యిది. దీంట్లోనే గల నీలి మందు మీ బట్టల్ని మరింత తెల్లగా, తాజాగా రూపొందిస్తుంది.

ట్రిలో మరెంతో కాలం మన్నుతుంది—ఇది ముద్దగా అయిపోదు. దీన్ని పూర్తిగా అరిగిపోయేదాకా వాడేవీలు.

అదనంగా నురుగు

అదనంగా శక్తి

అదనంగా పొదుపు

NEW Triple action Trilo BLUE DETERGENT WASHING TABLET

Extra lather* Extra power* Extra economy*

A Godrej Product

Trilo

ఇప్పుడే కొని చూడండి—త్రివిధ చర్యగల ట్రిలో ఎంత ఎంతెంత మేలైనదో!

గోద్రెజ్ ఉత్పాదన

CHAITRA-G-144 TEL

(గత సంచిక తరువాయి)














[ఇంకా ఉంది]




"ఎందుకీ మొసలి కన్నీళ్ళు?" అని చరాలున అనేసింది ఇందిరమ్మ.

చురుక్కున బాకుతో పొడిచినట్లు, ఛళ్ళున కొరడాతో చరిచినట్లు ఆ మాటలు రామదాసుని ఎంతో బాధ పెట్టినై. తల వంచుకొని అక్కడే ప్రాణంలేని ప్రతిమలాగా కూచుండి పోయాడు. అవుననటానికి, కాదనటానికీ నోరు మెదపలేక పోయాడు. కెరటాలుగా పొంగి వస్తున్న దుఃఖంతో అతని మనస్సు సుడితిరిగి పోయింది.

కాదు. కాదు. తన విచారమంతా కపట నాటకం కాదు. తల్లి తండ్రులెవ్వరూ దిక్కులేని కుర్రవాణ్ణి తెచ్చి ఇంట్లో కన్న కొడుకులాగా పెంచాడు ఇందిర భర్త సుందర్రావు. అండ లేని తనని ఆదుకొని ఆదరించి పెంచి పెద్ద వాణ్ణి చేశాడు. చదువు చెప్పించాడు. అటు వంటి సుందర్రావు, అనుక్షణమూ తను నాన్నా అంటూ చుట్టూ తిరిగిన తండ్రి ఆకస్మికంగా గుండె ఆగి చనిపోయాడు. అటు వంటి వాత్సల్యమూర్తిని కోలుపోయి విలపిస్తున్న తన కన్నీళ్ళు మొసలికన్నీళ్ళా? ఆ మాటల్లో ఎంత కుటిలత్వం, ఎంతనిర్దయా, ఎంత స్పర్ధా — తలచుకున్నకొద్దీ తల తిరిగి పోతోంది. గుండె మండిపోతూంది.

తను "అమ్మా" అంటూ ఆమెకి ఎంత దగ్గరగా పోవాలనుకుంటాడో ఆమె అంత దూరంగా విదిల్చి కొడుతుంది. తను ఆమె చుట్టూ అల్లుకు పోవాలనే ప్రయత్నిస్తాడు. ఇందిర మాత్రం అతన్ని పురుగులాగా దులప రించేస్తుంది. ఇన్నాళ్ళూ సుందర్రావు చూపిన ఆదరాభిమానాల వల్లనే తను ఆ ఇంట్లో నిలబడగలిగాడు. ఇందిర తననిఎంత ఈసడిం చేదో సుందర్రావు అంత దగ్గరికి తీసేవాడు. మొన్న మొన్నటిదాకా సుందర్రావు తన కన్న తండ్రి కాడని రామదాసుకి తెలియనేతెలియదు.

ఆ ఇంట్లో అడుగు పెట్టిన క్షణమే అతన్ని సుందర్రావు హృదయ మధ్యంలోకి స్వీకరించి కన్న కొడుక్కంటే మిన్నగా ప్రేమించటం మొదలు పెట్టాడు. మొదటి చూపులోనే ఎందుకో ఇందిరకు ఈ దిక్కులేని దీనుడి మీద కారణం లేని ద్వేషం అంకురించింది. ఈ ఊరు పేరు తెలియని బికారిని పెంచు కోటం తనకి సుతరామూ ఇష్టం లేదని భర్తకి నెత్తిన నోరు పెట్టుకుని చెప్పింది.

దిక్కులేని పిల్లాడికి తమ ఆస్తి నంతా దోచిపెట్టటం తనకి గిట్టదనీ, ఎవరైనా బంధువుల పిల్లాణ్ణి, కులం గోత్రం కలిసిన వాణ్ణి పెంచుకుందామని ఎంతో పట్టు పట్టింది. ఏ విషయంలోనూ ఇందిరమాటను జవదాటని సుందర్రావు ఈ సంద ర్భంలో మాత్రం భార్య మాటని చెవిలో దూరనివ్వలేదు. ఆ అనాథబాలకుడు రామదాసు మీద భర్తకి అవ్యాజమైన మమకారం ఏర్పడిపోయింది. రామదాసుని భార్య చిన్న చూపు చూడ్డం దేనికో అర్థంకాక సుంద ర్రావు లోపల్లోపల బాధపడ్డాడు. ఆ దీనుడి మీద తన అభిమానానికీ, ఇందిరమ్మ ఆగ్ర హానికీ కారణాల్ని గ్రహించని సుందర్రావు రామదాసుమీద ప్రాణాలూ పెట్టుకొని బతికాడు. తనంత ఆకస్మికంగా చని పోతానని సుందర్రావు కలలో కూడా అనుకో లేదు. అయినా ముందు చూపు మనిషి కావటంచేత ఒక కాగితంమీద రామదాసే తన ఆస్తికి వారసుడని వ్రాసి కవర్లో పెట్టి ఆ కవరు రామదాసు పెట్టెఅడుగున పెట్టాడు. ఆ కాగితం రిజిష్టరు చేయించనూ లేదు, రామదాసునికి స్వయంగా అందించనూ లేదు.

సుందర్రావు హఠాత్తుగా మరణించేసరికి ఇంట్లో రామదాసుకున్న అధికారం, ఆదరం ఒక్కసారిగా మాయమైపోయినై. తను పరాయివాడనీ, తనకి ఆ ఇంట్లో కానీ, ఆస్తితో ఏమీ సంబంధం లేదని అనుక్షణము ఇందిర సూటీపోటీ మాటలతో అంటున్నానే వుంది. రామదాసుకి ఆస్తిమీద మమకారమే కాని సుందర్రావుమీద నిజమైన ప్రేమలేదని ఇందిర అభిప్రాయం. అందుకే అతనివిమొసలి కన్నీళ్ళని అనటానికి కొంచెమైనా సంకో చించలేదు.

మొన్న చిందర వందరగా వున్న గుడ్డల్ని సర్దుతుంటే పెట్టె అడుగునున్న కవరు రామదాసు కళ్ళ పడింది. అందులో ఏముందో




ఇంద్రాణి సభకు వచ్చి నలుగురిముందూ నిలిచింది. మునులు తలలెత్తలేకపోయారు. దిక్పాలకులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. రాజపురుషుల ముఖాలు కోపంతో జేవురించాయి. వారిచేతులు ఖడ్గాలమీదకు చేరుకున్నాయి! అప్సరసలు నిగ్రహించుకోలేక కన్నీళ్ళు కార్చారు. నహుషుడి ముఖం సహితం కళావిహీనమయింది అతడి గాంభీర్యం తెచ్చిపెట్టుకొన్నట్టుగా అందరికీ తెలిసిపోతోంది. సింహాసనం మీదవున్న అతడే దోషి అయినట్టూ, సభామధ్యన నిలబడివున్న ఇంద్రాణే అతడిని విచారిస్తున్నట్టూ వుంది వాతావరణం.

నహుషుడు ఇంద్రాణిమీద మోపిన నేరం, శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపస్సు భంగం కాకుండా అడ్డుపడిందని. మునులు ఇంద్రాణిని ప్రశ్నించలేకపోయారు. ఇంద్రాణి తానే తన ఆరోపణకు సమాధానం చెప్పుకొంది.

"నేను రాక్షస రాజ్యానికి వెళ్ళినమాట యథార్థం. కానీ, శత్రువులలో చేతులు కలపటానికి కాదు. అంత నీచకార్యం నేనెప్పుడూ చేయను. దేవయాని జయంతి కూతురని అందరికీ తెలిసిన విషయమే! ఆమెను చూడటానికి వెళ్ళాను."

అది దోషమని ఎవరూ అనలేకపోయారు. నహుషుడే అనలేక పోయాడు. అందుకని, 'మేనకతో మీ జయంతుడి వివాహం చెయ్యటం కోసం, మన్వే ఈ పన్నుగడ పన్నివుండవచ్చుగదా !'' అన్నాడు.

"మేనకతో జయంతుడి వివాహం చెయ్యాలనే సంకల్పం నాకు లేదు. వారు పరస్పరం ప్రేమించుకొన్నారని తెలిసాక ఆ ప్రేమని గౌరవించాము. ఈ దేవలోకంలో ప్రేమని నిలుపుకోవటానికి వివాహాలు చేసుకోనక్కర్లేదు. కానీ, మేనక ఘంటాకర్ణుడికి బలి కాకుండా మాత్రమే ఈ వివాహం జరిపించాను."

సభ ఇంద్రాణి మాటలకు హర్షం ప్రకటించింది విషయాన్ని పరిశీలించి వివరాలు తెలుసుకొన్న దేవదూతలు, శుక్రాచార్యులను హెచ్చరించింది మయుడని చెప్పారు. మునుల ఇంద్రాణి దోషమేమీలేదని నిర్ణయించి ఆమెను సగౌరవంగా సభనుండి పంపివేసారు. నలుగురిలో నహుషుడే మూర్ఖుడిగా నిరూపింపబడ్డాడు. ఇంద్రాణి మీద ఎగతో దోషిగా ఆరోపించాడే కాని, ఇంద్రాణిని ఏమీ చెయ్యలేక పోయాడనీ, ఏమీ చెయ్యలేడనీ, లోకాలు గేలిచేసాయి. "ఇంద్రాణి సభకు రానూ వచ్చింది, సగౌరవంగా వెళనూ వెళ్ళింది. ఆమెను సభకు రప్పించిన అపకీర్తి

## ఆస్తి పంజరం

ఆత్రంగా తెరిచాడు. ఆస్తి అంతకీ తనని అధికారిని చేస్తున్న ఆ కాగితాన్ని చూసి రామదాసు విస్తుపోయాడు. తన కళ్ళని తనే నమ్మలేక పోయాడు. అప్రయత్నంగా అతని కళ్ళలో నీళ్ళు తిరిగినై. ఆ కాగితాన్ని మళ్ళీ భద్రంగా కవరులో పెట్టేసి అడుగున పడేశాడు. అందులో ప్రతి అక్షరంలోనూ చనిపోయిన సుందర్రావు హృదయ స్పందం వినిపించింది. చూసిన క్షణంలోనే దానిని తీసుకెళ్ళి ఇందిరకి చూపుదామనిపించింది. కానిఎందుకో వెనకాడింది మనస్సు. ఈ కాగితం సంగతి అసలు ఇందిరకు తెలుసో లేదో ?

ఏమో? తెలిసినంత మాత్రాన ఇప్పుడావిడ మనస్సు మారుతుందా? పైగా తనమీద అనాదరణ ఇంకా రెచ్చిపోతుంది. ఆమె దృష్టిలో తను కేవలం ఆస్తిని కాజెయ్యటానికి కాసుకుని కూచున్న దొంగ! అటువంటప్పుడు ఆవిడకి తనమీద మమకారం కలుగుతుందనుకోటం కలలో మాట. క్షణక్షణమూ ఆవిడలో మాత్సర్యం పెరుగుతోంది. సందేహం లేదు.

మరి తానిక ఆ ఇంట్లో ఏ ఆసరా చూసుకుని వుండాలి ? ఏందుకోసం వుండాలి ? ఇన్నాళ్ళూ తనని కంటికి రెప్పగా కాచిన సుందర్రావు అండ వుంది. ఆయన ప్రేమ, వాత్సల్యాలు అన్నిటినీ మరిపించినై. ఆయన ఆదరాభిమానాలకి ప్రపంచంలోని ధనమంతా కలిసినా సరిపోలేదు. ఇన్నాళ్ళూ ఇందిరకి కంటకంగా వున్నా తను ఆ ఇంట్లో వున్నది ఆస్తికోసం కానేకాదు. ఇకముందు తానక్కడ వుండవలసింది ఆస్తి కోసమేనా? అవును. ఆస్తికోసమే ఆవిడ అనే మాటలన్నిటినీ భరించి వున్నోసినా తుడుచుకుంటూ తానక్కడ వుండాలి. ఆవిడ ఎంత అగౌరవం చేసినా తనని కాదనుకుని పురుగులాగా తానక్కడ బతకాలి. అంతకి తప్ప గౌరవంగా తానెక్కడా బతకటానికిఆస్కారమేలేదు.

ఈ సంగతి ప్రతి క్షణమూ రామదాసుకి స్పష్టంగా తెలిసివస్తోంది. తాను దిక్కులేనివాడు. నా అనే వాళ్ళెవరూ అతనికి లేరు. అయినా అతనికి అభిమానం చేసిండి చచ్చి స్వర్గాన వున్న సుందర్రావుగారి దయవల్ల పెరిగి పెద్దవాడయ్యాడు. కొద్దో గొప్పో చదువుకున్నాడు. తను ఏకాకి, బికారి.

అయినా తను వెక్కసమై పోయిన ఇంట్లో అణిగి పడి వుండటం తలకి మించిన పనిగా తోస్తోంది. అనుక్షణమూ తనను చీదరించుకునే ఇందిరని జలగలాగా పట్టుకుని ఆస్తికోసం ఆ కొంపలో పడి వుండటం రామదాసుకి పెద్ద తలవంపుగా వుంది. ఎంత ఆలోచించినా అతనికి ఒకటే దారి కనబడుతోంది. అది ఎంత ఘోరమైన, అసాధ్యమైన మార్గమైనా అదే తనకి శరణ్యంగా కనబడుతోంది.

తెల్లవార్లూ కళ్లల్లో వత్తులు వేసుకుని కూచున్నాడు పసితనంనుంచీ తను ఆ ఇంట్లో గడిపిన రోజులన్నీ మనస్సులో గిరగిరతిరిగినై. సుందర్రావు ఫొటోకేసి చూసినప్పుడల్లా అతనికి ఒళ్ళు తెలియని దుఃఖం పొర్లుకొచ్చింది. ఆ ఇంటో ఆయనవి రెండే ఫొటోలున్నాయ్. రెంటిలో చిన్న ఫొటో తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. తన పెట్టె అడుగునున్న కవరుతీసి లాంతరు వెలుతుర్లో విన్నోసార్లు చదువుకున్నాడు. అతని కన్నీళ్లతో అక్షరాలన్నీ చెదిరిపోయినయ్. ఆ కాగితం చేత్తో పుచ్చుకుని ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూశాడు.

గోడ గడియారం నాలుగు కొట్టింది. కిటికీలోంచి అరుణరాగ రేఖలు తూర్పు దిక్కున కనిపించినై. పక్కనున్న వేపచెట్టు గుబుర్లోంచి పక్షుల కిలకిల ధ్వనులు వినిపించినై. పిల్లిలాగా అడుగు వేస్తూ వాకిలి దాకా వెళ్లాడు. గిరున వెనక్కి తిరిగొచ్చి ఇందిర నిద్రపోతున్న గది గుమ్మం దగ్గర నిలబడి "అమ్మా" అని పిలిచాడు

ఉలిక్కిపడి లేచింది ఇందిర. "పొద్దున్నే ఏం మునిగిపోయింది? లేవగానే నీ ముఖం చూడాల్సొచ్చింది" అని విసుక్కుంటూ కళ్లు తెరిచింది.

"వెళ్తున్నానమ్మా! ఇక నా ముఖం చూపించి మిమ్మల్ని బాధించను లెండి. శలవిప్పించండి. వెళ్లొస్తా" అన్నాడు రామదాసు కన్నీళ్లతో వణుకుతున్న కంఠంతో.

ఇందిర తన చెవులని తానే నమ్మలేక పోయింది. ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసి "ఎక్కడికి?" అంది.

"ఎక్కడికో నేనేంచెప్పనమ్మా? ఎక్కడున్నా మీ మేలు జన్మ జన్మలకీ మరచిపోలేను. నాన్నగార్నీ, మిమ్మల్నీ ప్రతినిమిషమూ తలచుకుంటూ ఎక్కడో పొట్టపోసుకుంటాను" అని రామదాసు కొంచెంసేపు ఆగాడు. ఇందిర విస్మయంతో అతనికేసి రెప్ప వాల్చకుండా చూస్తూ "వెళ్తావా? నిజంగానా?" అని అడిగింది.

"నిజమేనమ్మా! వెళ్లిపోతూ మీ దగ్గర శలవు తీసుకుందామని నిద్రా భంగం చేశాను మీకు. క్షమించండి. ఇదిగో ఈ కవరు మీ దగ్గర భద్రంగా అట్టేపెట్టండి. నాన్నగారు దయతో నాకిచ్చినా వారి ఆస్తితో నాకేమీ ప్రమేయం లేదు. వారు నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసి చదువు చెప్పించారు. నా కంతే చాలు" అని వెళ్లటానికి ఒక అడుగు ముందుకు వేశాడు. దీపం పెద్దదిచేసి ఆ కవరు విప్పి కాగితాన్ని ఇందిర ఆత్రంగా చదివేసి "ఆగు రామదాస్" అని కేకవేసింది.

"మరచిపోయానమ్మా! ఇదిగో నాన్నగారి చిన్న ఫొటో, మిమ్మల్నడిగి తీసుకపోదామనుకున్నాను" అన్నాడు రామదాసు క్షణం సేపు ఆగి.

"వెళ్లిపోతావా రామదాస్? అయితే నీ పెట్టె కూడా తీసుకపోవా?" అంది ఇందిరమ్మ.

"వొద్దమ్మా వొద్దు. మీమేలు జన్మజన్మలకీ మరచిపోలేను. దయుంచండి. వెళ్లొస్తా" అని చేతులు జోడించి గబగబా బైటికి వెళ్లిపోయాడు. ఇంకా విడిపోని మసక చీకటిలో రామదాసు క్షణంలో మటుమాయమై పోయాడు.

ఇందిర అక్కడే నిలబడిపోయింది. కాళ్ళ క్రింద నేల అణగారి పోతున్నట్లనిపించింది. లేశం కూడా ద్వేషంలేని రామదాసు ప్రశాంత గంభీరస్వరం ఆమె గుండెల్లో గింగురుమంటున్నది. కపటంలేని కల్మషంలేని అతని చిరునవ్వు ఆమె మనస్సుకి ఆగ్నేయాస్త్రంలాగా తాకింది. అప్రయత్నంగా "రామదాస్!" అని పిలిచింది. మారులేని ఆ పిలుపు దొడ్లో లేగదూడల "అంబా" అనే అరుపుల్లో కలిసిపోయింది.

* * *

"ఎందుకమ్మా ఇందిరమ్మా! ఊరికే కాలయాపన చేస్తావ్?" అంది పొరుగింటి సరస్వతమ్మ.

"బాగుందే మీరు చెప్పేది! నాదేనేమిటి ఆలస్యం?" అంది ఇందిర.

"కాకపోతే ఇంకెవరిది? నువ్వు ఊఁ అంటే రేపీపాటికి అన్నిపనులూ అయిపోవూ?"

"మీరూరికే మాట వరసకి అంటారుగావి నిజంగా ఇస్తారేమిటి"

"భలేదానివి. నెపం మా మీద వేద్దామనా! నువ్వు ఊఁ అను రేపీపాటికల్లా మా వారిని ఒప్పించి మా చిన్నవాడ్ని పెంపుడు చెయ్యకపోతే నా పేరు మారు పేరు పెట్టే! ఇదేమైనా కొత్త సంగతా? నీతో విన్నాళ్లనుంచో చెబుతున్నానో మరి. ఆ రామదాసు పారిపోవటంతో ఇప్పుడు చిక్కే తీరిపోయింది గదా. ఇంకెందుకమ్మా సంకోచం."

"నాకెందుకండీ సంకోచం? మీరు నిజంగా ఇస్తే కళ్లకద్దుకొని పెంచుకుంటాను. అంతకంటే నా కింకేం కావాలి?" ఇందిర అనటమే



తడవుగా సరస్వతమ్మ తూనీగలాగా ఇంటిలోకి దూసుకుపోయింది.

# ఆస్తి పంజరం

వారం తిరక్కముందే దత్త హోమం జరిగింది. కాగితాలతో అంతా బిగించుకున్నాకే సరస్వతమ్మగారు చిదంబరాన్ని ఇందిరమ్మ గారికి పెంపుడు ఇచ్చింది. పెంపుడు జరిగే రోజున వద్దనుకున్నా రామదాసు ముఖమే ఆవిడ మనస్సులో తొంగి తొంగి చూసింది. అన్ని రోజులూ మనవి కావనీ ఎటువొచ్చి చిటు పోయినా మంచిదన్న దూరదృష్టితో ఇందిర పది ఎకరాల పొలం మాత్రం తన పేరున అట్టేబెట్టుకుంది మిగిలిన పొలం పుట్రా యావత్తు చిదంబరాని కిచ్చేసింది. ఈ సంగతి తెలుసుకున్నాక సరస్వతమ్మగారి సంబరం సగం చచ్చిపోయింది. అంతా పిల్లాడి కివ్వకుండా కొంత తన పేర ఎందుకు పెట్టు కోవాలి? పెంపుడు జరిగిన క్షణం నుంచీ సరస్వతమ్మకి ఇందిర మీద ఈ విషయాన్ని పురస్కరించుకొని స్పర్థ ఏర్పడింది. ఇందిర మాత్రం ఈ విషయంలో ఎవరు చెప్పినా వినలేదు.

పెంచుకొనేటప్పటికి చిదంబరానికి తొమ్మిదో ఏడు. అప్పటికింకా అక్షరాభ్యాసం కాలేదు ఎంతో ఖర్చుపెట్టి ఇందిర అట్టహాసంగా అక్షరాభ్యాసం చేసింది. పగిలే పలకలకీ, విరిగే బలపాలకీ, బళ్లో తెచ్చే జట్టీలకీ, అంతులేదుకాని చదువు మాత్రం అంటటం లేదు. అయిదుబళ్ళు వచ్చేసరికే పెద్దలు దిగివచ్చారు. తరువాత ఒక్కొక్క క్లాసు దాటటం ఒక పెద్ద గండం అయి పోయింది.

చదువుమాట దేవుడెరుగు. పోనీకుదురుగా వుంటే ఇందిర సంతోషించేది. అల్లరికీ, ఆగానికీ, అఘాయిత్యానికీ అతన్ని చెప్పే మరొకళ్ళనిచెప్పాలి గుడిగోడలెక్కి దూకటం, తోటిపిల్లల్ని చావగొట్టటం, చాటుగా ఇతర్లు కాల్చిపారేసిన ఎంగిలి బీడీలు తాగటం—చెయ్యని అల్లరిలేదు. ఇవన్నీ చూస్తుంటే ఇందిరకి ప్రాణం విసిగిపోయేది. సాధ్యమైనంతవరకు సహించేది. ఎప్పుడైనా కోపంవచ్చి భయం చెబుదామని చెయ్యి చేసుకుంటె చిదంబరం ఇంటికి పారిపోయేవాడు. గోరింతలు కొండం తలుచేసి చెప్పేవాడు. ఇక సరస్వతమ్మ పెద్ద రాద్ధాంతంచేసి ఊరునాడూ యాగీ చేసేది. ఆవిడ నోటి ధాటికి అంతా హడలిపోవలసిందే! ఆవిడ తిట్లు నిఘంటువులో కూడా దొరకవు!

ఒక్కనాడయినా చిదంబరం తనని నోరారా అమ్మా అని పిలిచిన పాపానపోలేదు. ఆ ఒక్క పిలుపుకి ఆవిడ గుండె ఝల్లుమని అన్నిటినీ క్షమించగలిగేది. చిదంబరం ఎంత కొక్కిరాయి గాడైనా ఆవిడమాత్రం ఎప్పుడూ 'నాయనా', బాబూ, అని ఎంతో ముద్దుగా పిలుచు కుంటుంది. తను ఎంత ఆప్యాయంగా లాలిస్తుందో వాడంత పెడసరంగా కసిరి కొడతాడు. తను ఎంత ఆదరించి పెంచినా

ఇక్కడేదో కష్టపడుతున్నట్లుగా ఇంటికి పారిపోయి వారాల తరబడిగా తల్లిదండ్రుల దగ్గర వుండిపోతాడు. తను వెళ్ళి బతిమాలిన కొద్దీ బిర్రబిగిసి కొమ్మెక్కి కూచుంటాడు. సరస్వతమ్మగారి అప్రతిహత దూషణలకి తనని గురి చేస్తాడు. అసలు చిదంబరం నోటి వెంట ఏ మాట వచ్చినా కత్తి విరిచి పొయ్యిలో పెట్టినట్లుంటుంది. పుట్టింది మొదలు తల్లిదండ్రుల వల్ల గాని, భర్త వల్ల గాని మాటపడి ఎరుగని ఇందిర ఈ తిట్లకి లోపల్లోపల కుమిలిపోతుంది.

అయిదోక్లాసులోనే చిదంబరం సరస్వతీదేవికి సలాంకొట్టేశాడు. ఊళ్ళో రికామీగా హైరోడ్డు క్రాపులు ఎగదువ్వి, ఛాతీ విరుచుకొని, సిగిరెట్లు తాగుతూ తిరిగే కుర్రాళ్ళ

## ఆస్తి పంజరం

ఆ ట్ట్యాకు చిదంబరం అగ్రనాయకుడు. కయ్యానికి కాలు దువ్వుతూ అడ్డం వచ్చిన వారందర్నీ చావగొట్టడం, సత్రం అరుగుమీద రాగిచెట్టు నీడ కింద అస్తమానమూ చీట్ల పేకాడడం, దారి వెంట అందమైన ఆడవాళ్లెవరైనా వెళ్తుంటే ఈలలు వెయ్యటం, గంటల తరబడి మంచినీళ్ళ చెరువులో ఈతలు కొట్టటం ఈ బృందం యొక్క నిరంతర కార్యక్రమం

ఇవన్నీ విని ఇందిర లోపల మండిపోయేది. చిదంబరంతో నోరెత్తి మాట్లాడటం కూడా అసహ్యమనిపించేది. అయినా ఎన్నోసార్లు చెప్పి చూసింది. ఏమి లాభంలేదని తెలుసుకొని చెంపలు వేసుకుంది. ఒక్కనాడూ వేళకి అన్నానికిరాడు. ఇప్పుడు రెండుపూట్లా తన వేళకి తను తిని మూత పెడుతుంది. ఎప్పుడో వచ్చి చిదంబరం తనే పెట్టుకుని తింటాడు.

ఇదంతా తను చేతులారా కొనితెచ్చు కొన్నది కాదా ? రామదాసుని ఇంట్లోంచి తరిమివేసిన తనకి ఇది తగినశిక్ష కాదా ? ఆస్తిని గడ్డిపరకలాగా దులుపుకుని వెళ్ళిపోయిన రామదాసు రూపం ఎందుకో ఎప్పుడూ ఇందిర మనస్సులో మెదుల్తూనే వుంటుంది. చిదంబరం చేసే చిద్విలాసాలు చూస్తున్న కొద్దీ ఇందిరకి తనమీద తనకే రోత కలుగుతోంది. తన చేతులో ఆస్తి అంతా ఈ గుండానికి అప్పగించేసింది. ఇక తను ఇష్టం లేకపోతే మాత్రం ఏం చెయ్యగలదు? ఈ పెంపుడు ఇల్లా పరిణమిస్తుందని ఎన్నడైనా అనుకుందా? క్షుఅవాడి ఎర చూపించి తన ఆస్తినంతటినీ సరస్వతమ్మ ఇల్లా విలువు దోపిడి చేస్తుందని తను కలలోనైనా తలపోసిందా !

తను ఎవరిని నిందించలేదు. తనే అంతకీ కారకురాలు. విత్తు నాటినవాళ్ళు కోతకొయ్యటానికి వెరిస్తే ఎల్లాగు ?

వలభయ్యోపడిలో అడుగు పెట్టింది ఇందిర. కాని నూరేళ్ళూ నిండినంత విరక్తిగా వుంది. చిదంబరం గుండెలమీద కుంపటిగా తయారయ్యాడు. "ఫలానా వారి పెంపుడు కొడుకు!" అని అంతా హేళనగా వేలెత్తి చూపుతున్నారు. అతనివల్ల తమ వంశవృక్షం పూలతో కాయలతో కలకాలం పచ్చపచ్చగా వుంటుందని కొండంత ఆశతో పెంచుకుంది. అటువంటి చిదంబరం తనకి, చచ్చి స్వర్గాన వున్న భర్తకీ, పరువు మర్యాదలకి పేరు మోసిన తన వంశానికీ చెరిగిపోని మచ్చగా తయారైనాడు. ఏమి చెయ్యటానికి పాలు పోవటం లేదు. ఈ కత్తుల బోనులోంచి బైటపడేదారి దొరకటంలేదు. ఈ దుర్గంధపు వాతావరణానికి దూరంగా తీసుకుపోయే దోవ కానరావటం లేదు. తనని తిట్టుకుంటూ పరితాపంతో భగ్గున మండే కన్నీళ్ళతో ఇందిర దినమొక యుగంగా గడుపుతోంది.

ఇన్నాళ్ళూ సత్రంలో సమావేశమయ్యే

బృందాన్ని చిదంబరం ఇప్పుడు తీసుకొచ్చి ఇంట్లో తేపిణి వేస్తున్నాడు. కేరింతలూ, ఈలపాటలూ, కూనిరాగాలూ, మోటసరసాలు ఇల్లంతా మోగిపోతున్నయ్. ఆ చీట్లాటకి పగలూ రాత్రీ విరామమేలేదు.

పేకముక్కలు చకచకాకలుపుతూ మధ్యలో "ఏయ్ మా కందరికీ కాఫీ తీసుకురా!" అని చిదంబరం ఒక పొలికేక వేశాడు. అది విని కూడా ఇందిర పలకలేదు. "నీకే చెప్పేది నీకేమైనా చెముడా ?"అని చిదంబరం మళ్ళీ అరిచాడు.

కూమన్న ఇందిర త్రుళ్ళిపడి లేచి పొంగి వస్తున్న అభిమానంతో చీట్లాట జరుగుతున్న గది గుమ్మం దగ్గరికి వెళ్ళి నిలబడి గుడ్లు ఉరుముతూ "జాగర్త గా రానీమాటలు. నేను నీకింద దాసీననుకున్నావా ? పోముందు, బయటికి నడూ ఈ రౌడీ మూకని తీసుకొని, నా గడప తొక్కితే నేనూరుకోను. నడూ బైటకి" అని ఎక్కడలేని ఆవేశమూ వచ్చి అరిచింది.

క్షణంసేపు ఆట కట్టుబడి పోయింది. ఇందిర ఉగ్రస్వరూపం చూసి అంతా పిల్లులై పోయి కూచున్నారు. చిదంబరం మరుక్షణంలోనే తెప్పరిల్లుకుని "నువ్వెవరివి నాకు అడ్డు రావటానికి ? ఇవాళ చీట్లాడుతాం రేపు తాగి తందనాలాడుతాం. ఎల్లుండి భోగం వాళ్ళని తెచ్చి తైతక్కలాడతాం. నీకెందుకు. అసలు నీకేం హక్కుంది ? ఇది నా ఇల్లు. ముందు నువ్వే బైటికి నడూ" అన్నాడు. అక్కడ చేరిన కుర్రాళ్ళందరూ వారేవా, వహ్వా, సెభాష్, అని కేకలు ఈలలు వేశారు. అందరి ముందు ఇందిర తల కొట్టేసినట్లు అయింది. ఆ క్షణంలో తల నేలకేసి కొట్టుకొని చావాలనిపించింది. అవమానంతో, ఆవేశంతో, ఆక్రోశంతో గజగజవణికిపోయింది. "పశువా! సిగ్గులేదా?" అని అరచింది.

"తెలుస్తానే వుంది ఎవరికి సిగ్గులేదో, యింతమంది మొగాళ్ళముందుకి రావటానికి నీకు సిగ్గుందా? ముందు నడు బైటకి, నా ఇంట్లోంచి పో అవతలకి" అంటూ పిచ్చెత్తిన వాడిలాగు మీదికి వచ్చాడు.

"ఆగు, తొందర పడకు. ఇదుగో ఇప్పుడే నేను వెళ్ళిపోతున్నానులే. నీ యిష్టం వచ్చినట్లు వూరేగు" అంటూ ఇందిరమ్మ గబగబా వెళ్ళిపోయింది.

* * *

# ఆస్తి పంజరం

"ఎక్కడికి వెళ్తున్నారు మీరు ?" అని పక్కనే కూచున్న మనిషి అడిగింది. నుదుట చేరెడు బొట్టూ, అక్కడక్కడ నెరిసినజుట్టూ, సంతృప్తితో నిండి తొణికే ముఖమూ.

"యాత్రలకి బయలుదేరానండి" అంది ఇందిరమ్మ.

"మళ్ళీ ఎన్నాళ్ళకి ఇంటికి తిరిగి వస్తారు. ఏందుకోనమ్మా! బయలుదేరిన దగ్గర్నుంచీ నా మనస్సు ఇంటిమీదే వుందమ్మా !"

"చేతులో డబ్బు ఉన్నంతకాలం ఒంట్లో వూపిరున్నంత కాలం యాత్రలు చేద్దామనుకుంటున్నానండీ" అంది ఇందిరమ్మ విరక్తితో.

"నా కంత నిబ్బరం లేదమ్మా! అప్పుడే మనస్సు పీకుతోంది. వారెల్లా వున్నారో? మా పెద్దవాడెల్లా వున్నాడో? చిన్నవాడు బళ్ళోకి పోతున్నాడో లేదో. మా అమ్మాయి—కొడుకు అక్షరాభ్యాసం నాటికి తప్పక రమ్మని రాసింది. గంగా స్నానం చేసి తిరుగు రైల్లో వెళ్ళిపోతాను, అయితే నీకు పిల్లలెందరమ్మా ?"

"నాకు బిడ్డా పాపా ఎవ్వరూ లేరండి" అని ఇందిర చాటుగా కళ్ళు తుడుచుకుంది. ఆమెని వెనక్కి గుంజుతున్నట్లు తనని బలంగా లాగే అనుబంధం లేదు. తన కెవరూ లేరు. తన హృదయం ఎడారి. తన జీవితం విలువలేని మరుభూమి.

అల్లా మనస్సు శూన్యంగా బరువుగా తోచినప్పుడు భర్తని తలచుకుంటుంది. తలుచుకోగానే ఎందుకో తెలియకుండా రామదాసు కూడా గుర్తొస్తాడు. ఆ స్మృతి ఆమె నెంతో వేధించి బాధించుతుంది.

"మీ టికెట్ ఏది ?" అంటూ ఎవరో ఖాకీసూటుతో హ్యాటుతో పెట్టెలో వున్న అందరినీ తనిఖీ చేస్తున్నాడు. ఇందిర చేతి సంచిలో పర్సులో పెట్టిన టికెట్ బైటకితీసి చేతులో పుచ్చుకుని కూచుంది.

"అమ్మగారూ! నమస్కారం. మరచిపోయారా ? గుర్తువట్టలేదా ? నేను రామదాసుని. ఎక్కడికి వెళ్తున్నారు" అని ఎంతో ఆప్యాయంగా అడిగాడు.

ఇందిరమ్మ విస్మయంతో వెలవెలపోయింది. తన్నుకున్నా నోట మాట రావటంలేదు. గుండె దడదడ కొట్టుకుంటోంది. రామదాసు ముఖం చూడలేని చిన్నతనం ఒకప్రక్క, జన్మలో తిరిగి చూడలేననుకున్న అతన్ని కలుసుకోగలిగానని పారవశ్యం ఒకప్రక్కా ఆమె హృదయాన్నిమథించివేసినయ్. ఎంతో సేపటికి అతి ప్రయత్నంమీద "బాగున్నావా రామదాస్" అని అడిగింది.

"మీ దయవల్ల బాగున్నానమ్మా మా యింట్లో మీరు తప్పకుండా దిగి ఒకరోజుండి వెళ్ళాలి. నా మాట తీసెయ్యకండమ్మా" అని బతిమాలుకున్నాడు.

అమ్మా అన్న పిలుపుకోసం తపించిపోయిన ఆమె హృదయం మీద ఆ మాటలు పన్నీటి జల్లులాగా సోకినై. "ఓ! తప్పకుండానూ! దిగటమే కాదు నువ్వు వెళ్ళమనేదాకా వెళ్ళనే వెళ్ళను. తెలుసా?" అంది ఇందిరమ్మ చిరునవ్వు నవ్వుతూ.

"అంతకంటే ఇంకేం కావాలమ్మా ? ఈ విధంగానైనా మీ ఋణం కొంత తీర్చుకుంటాను" అన్నాడు రామదాసు. మూలగాలి తగిలిన శ్రావణ మేఘంలాగా కరిగిపోయింది ఇందిరమ్మ హృదయం.



# హైదరాబాద్ నోట్ బుక్

## ఇప్పపూవు, చెరకు సారాయి:

ఇప్ప పూలనుంచి, చెరకునుంచి సారాయి తీయడం గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు మంత్రి శ్రీ జగన్నాథరావు ఏప్రిల్ 8న విధాన సభలో తెలిపారు. దీనికిఆలోచన అవసరమా? ఇప్పసారాయి—మాధూక మద్యం గురించి చెరకు అల్కాహాలు, సరకం గురించి రెండువేల ఏళ్లనాటి వర్ణనలు హాల శాతవాహనుని గాథా సప్తశతిలో కోకొల్లలు. ఇప్ప పూలు ఏరడం పూర్వంనుంచి ఒక పరిశ్రమ వప్పు మానెదిపాలకు, పరిశ్రమలకు వాడడం అనాదిగా ఉంది. చెరకు మద్యంపై కూడా శ్లేషలు చాల ఉన్నాయి. సరకం అంటే చెరకు సారాయి ప్రాకృత్యంలోని అందం వల్ల శరద్ఋతువు అని కూడా దీనిని శ్లేషించవచ్చు. ఏమిటి ఈ దోస తీగ ఈమోడును అల్లుకుందే? అని ఒకరు అడిగితే, అది సరయం దోషం — శారదృతువు మహిమ సుమా! అని మరొక జవాబు. సరఘం—చెరకు సారాయి మహిమ వల్ల మత్తు ఎవరయినా అనుచితమైన పని చేయవచ్చునని శ్లేష కప్పిప్రాణి తద్వని, ఇప్ప, చెరకు అల్కాహాలు మన రాష్ట్రంలో అనాది పరిశ్రమలుగనుక వాటిని పునరుద్ధరిస్తే పరిశ్రమలకు ఎంతో ప్రయోజకరం!

## ఆత్మార్పణం:

కర్తవ్య నిర్వహణ తర్వాత ఆత్మార్పణం చేసుకోడం జైన బవుద్ధులలో ఉంది వైదిక ధర్మానుయాయులలో లేదు. కాని సుప్రసిద్ధ వైద్యులు, సత్కార్యనిరతులు, దరిద్ర నారాయణ సేవా పరాయణులు డాక్టర్ కొలచల వెంకట కృష్ణమూర్తి గారు ఇలాటి సంప్రదాయం ప్రవర్తింపజేశారు. ఆత్మాహుతితో, డాక్టర్ వెంకటకృష్ణమూర్తి కృష్ణాజిల్లా ఉయ్యూరులో జన్మించారు. మద్రాసులో విద్యాభ్యాసం చేశారు. ఎల్.ఎం.పి. అయి, గుంటూరులోవైద్యవృత్తిలో స్థిరపడ్డారు. అత్యల్ప ప్రతిఫలంతో పేదలకు వైద్యం చేయడానికి పూర్ డిస్పెన్సరీ స్థాపించారు. ధన్వంతరిగా, పేదల డాక్టరుగా పేరు పొందారు. రామకృష్ణ పరమహంస భక్తులై, గుంటూరులో చదువుకొనే పారుగూరి విద్యార్థులకు ఉచితంగా భోజన వసతి కల్పించడానికి రామకృష్ణ విద్యార్థివసతిగృహం స్థాపించారు. ఇరవై సంవత్సరాలు దానిని నిర్వహించారు. భారతీయ సంస్కృతికి ఆలవాలమైన సంస్కృతాన్ని ప్రచారం చెయ్యాలనితలచి శ్రీరామకృష్ణ సంస్కృత కళాశాలను స్థాపించి, తమ భవనాన్ని దానికి దానం చేశారు. దానికి క్రమంగా మరి కొన్ని కొత్త భవనాలు కట్టించారు. అది పిదప డాక్టర్ కె. వి. కృష్ణమూర్తి సంస్కృత కళాశాలగా స్థిరపడింది. దాని నిర్వహణ నిమిత్తం గుంటూరు అరండల్‌పేటలో వేయిగజాల స్థలంలో ఉన్న తమ మరొక భవనాన్ని కూడా దానం చేశారు. ఇప్పుడే కళాశాల సుమారు 200 మంది విద్యార్థులతో అలరారుతున్నది. డాక్టర్ కె. వి. కె. వైద్య సంఘం సభ్యులుగా విదేశ యాత్ర చేశారు. తమ సతీమణి, కీర్తిశేష శ్రీమతి శ్యామలాంబ ప్రోత్సాహంతో పెక్కు ధర్మ సంస్థలకు పలు రీతుల సహాయం చేశారు. జీవితం నిండుగా ఉంది.రాజధానిలో తమ కుమార్తె, అల్లుడు ఇద్దరు దవుహిత్రులు, ఒక దవుహిత్రితో సంతృప్తికరమైన జీవితం, ఇక ఈ ఐహిక జీవితం చాలునను కున్నారు. తాము గడించినదంతాఎలా సద్వినియోగం కావాలో,దగ్గర వారు ఎవరూ అసంతృప్తి పడకుండా, వీలునామా వ్రాశారు. కాశీ యాత్రకు బయలుదేరారు. భీష్మ ఏకాదశినాడు [గడిచిన ఫిబ్రవరి 15] గంగానదిలో ఆత్మార్పణం చేసుకొన్నారు. ఇలా చేస్తానని వీలునామాలో కూడా స్పష్టీకరించారట.

> క్షణశః కణశశ్చైవ
> విద్యా మర్థం సాధయేత్,
> గృహీత ఇవ కేశేషు
> మృత్యునా ధర్మ మాచరేత్—

అనే సూక్తికి సముజ్జ్వలోదాహరణం డాక్టర్ కొలచల వెంకట కృష్ణమూర్తిగారు.

## ఏడాదిలోగా పెక్కు ఆడిటోరియంలు :

జంట నగరాలలో, ఇతర పట్టణాలలోను ఏడాదిలోగా పెక్కుఆడిటోరియంలు నిర్మితమవుతాయని సాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఏప్రిల్ 9న పత్రికా ప్రతినిధులకుతెలియజేశారు. జంటనగరాలలో నిర్మితమయ్యే ఆడిటోరియంలో రవీంద్రభారతి స్థాయిలో ఉండగలవని ఆయన తెలిపారు. ఈ ఆడిటోరియంలలో ఒకటిశ్రీ పొట్టి శ్రీరాములు పేరిట నెలకొంటుంది. మరొకటి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పేరిట ఆంధ్ర బ్యాంకి ఉద్యోగులు 16 లక్షల వ్యయంతో నిర్మించనున్నారు. వరంగల్లులో బమ్మెరపోతన స్మారక ఆడిటోరియం నెలకొంటుంది. విశాఖ పట్టణంలో శ్రీ తెన్నేటి విశ్వనాథం స్మారకంగాను, విజయనగరంలో ఆనంద గజపతి స్మారకంగాను ఆడిటోరియంలు నిర్మిస్తారు. కడపలో15లక్షలతో ఒక ఆడిటోరియం నిర్మిస్తారు. రవీంద్రభారతివంటి ఆడిటోరియంలోను ఎన్నో లోపాలున్నాయి. రంగాల ఏర్పాటు త్వరగా జరగడానికి వీలు లేకుండా ఉంది. కనుక కొత్తగా నెలకొనే ఆడిటరియంలు ఒకమారు పెక్కు రంగాలను ఏర్పాటు చేసుకొనడానికివీలుగా రివాల్వింగ్ పద్ధతిలో ఉండాలని నా అభిప్రాయం. రంగ స్థలపు ఏర్పాట్లలో తమిళ, మహారాష్ట్రలు ఎంతో ముందంజ వేశారు. వారి మంచి కొన్ని అంశాలు నేర్చుకోవడం తప్పేమీ కాదు.

## నాటక అకాడెమీ సంకల్పం:

ప్రజలకు నాటకాల పట్ల ఆసక్తి కలిగించి టిక్కెట్లు కొని నాటకాలు చూచే విధంగా నాటకరంగాన్ని పునరుద్ధరించడం నాటక అకాడమీ





లక్ష్యమని ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి జమున మార్చి 16న తెలియజేశారు. ఈ లక్ష్యసాధనకు నిమిత్తం ఒక సంచార రంగస్థలాన్ని ఏర్పాటు చేయాలని అకాడమీ నిర్ణయించిందని, జిల్లా కేంద్రాలలో ఆడిటోరియంల నిర్మాణానికి ప్రయత్నించవలసి ఉందని, రాష్ట్రంలోని ఔత్సాహిక నాటక సంఘాలు అవి ప్రదర్శించే నాటకాలు గురించి సర్వేక్షణం జరపడానికి ఒక సంఘం నియమించదలచి నట్లు ఆమె తెలిపారు. నాటక అకాడమీ స్వయంగా ఒక తెరను తయారు చేయదలచిందని, అది నూరేళ్ల నాటక చరిత్రకు ప్రతినిధిగా ఉండ గలదని ఆమె అన్నారు.

— తిరుమల రామచంద్ర

### గమనిక

పాఠకులు వడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.









## ఇంద్రసింహాసనం

(13వ పేజీ తరువాయి)

తప్పించింది." ఈ వార్త ముల్లోకాలలోనూ వ్యాపించింది. అతికొద్దిమంది సంప్రదాయాలు పాడయిపోతున్నాయని బాధపడినా, స్త్రీలోక మంతా ఇంద్రాణికి జేజేలు పలికింది.

### 13

ముల్లోకాలూ విభ్రాంతిలో మునిగి పోయాయి. నహుషుడు ఇంద్రాణిని సభకు పిలిచి విచారణ జరిపిస్తున్నాడు !! ఇంద్రాణి వల్ల ఎన్నిలోపాలు జరిగినా, త్రైలోక్యరాణి ఇంద్రాణిపట్ల అన్నివర్గాలవారికీ ఒకవిధమైన గౌరవం వుంది. అంతటి పుణ్యారాలిని సాధారణ స్త్రీలాగ నిండుసభలో నిలబెట్టి విచారించటం ఎవరూ సహించలేకపోయారు. అందరూ నహుషుడి అహంకారాన్ని నిరసిం చారు.

### అతి "నిద్ర" పనికిరాదు

రకరకాల కారణాలవలన నిద్రలేమితో బాధపడే వారి సంఖ్య రోజు రోజుకు ఎక్కువవుతున్నది. వీరందరికి తగినంత నిద్రను సమకూర్చటానికి నిద్ర మాత్రలు అనేకం వున్నాయి. అయితే నిద్ర అన్ని వేళల ఒక వరం కాదనీ, నిద్రలో కూడా అపాయం ఏర్పడటానికి అవకాశం వుందని పశ్చిమ జర్మనీ శాస్త్రవేత్తలు ప్రకటించారు. బలవం తంగా నిద్ర పోయేసమయంలో శరీరంలో ఆక్సిజను పరిమాణము కావలసిన దాని కంటే తక్కువగా వుంటుందనీ, మెదడు లోని "గార్డ్ సెల్సి" పనిచేయక పోవడం జరుగుతుందని వీరు తెలియ చేశారు. ఉబ్బసం, కాలేయ వ్యాధులు, గుండె జబ్బులు కలవారిలో నిద్ర సమయంలో ప్రమాదం ఎక్కువ కావటానికి అవకాశ మున్నది. అధిక బ్లడ్ ప్రెజర్ గల వారిలో రక్తపీడనం స్థిరంగా వుండదు. అందుకని, నిద్ర అన్నివేళలా ఒక వరం కాదు. కానీ, కొన్ని సందర్భాలలో నిద్ర లేమి కంటే నిద్రే లాభకరం కావచ్చు. దీనిని దృష్టిలో వుంచుకుని ఏది ముఖ్యమో తెల్సుకోవాలని డాక్టర్లను వారు హెచ్చరిస్తున్నారు.




ఇంద్రాణి సభకు వచ్చి నలుగురిముందూ నిలిచింది. మునులు తలలెత్తలేకపోయారు. దిక్పాలకులు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. రాజపురుషుల ముఖాలు కోపంతో జేవురించాయి. వారిచేతులు ఖడ్గాలమీదకు చేరుకున్నాయి! అప్సరసలు నిగ్రహించుకోలేక కన్నీళ్ళు కార్చారు. నహుషుడి ముఖం సహితం కళావిహీనమయింది అతడి గాంభీర్యం తెచ్చిపెట్టుకొన్నట్టుగా అందరికీ తెలిసిపోతోంది. సింహాసనం మీదవున్న అతడే దోషి అయినట్టూ, సభామధ్యన నిలబడివున్న ఇంద్రాణే అతడిని విచారిస్తున్నట్టూ వుంది వాతావరణం.

నహుషుడు ఇంద్రాణిమీద మోపిన నేరం, శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపస్సు భంగం కాకుండా అడ్డుపడిందని. మునులు ఇంద్రాణిని ప్రశ్నించలేకపోయారు. ఇంద్రాణి తానే తన ఆరోపణకు సమాధానం చెప్పుకొంది.

"నేను రాక్షస రాజ్యానికి వెళ్ళినమాట యథార్థం. కానీ, శత్రువులతో చేతులు కలపటానికి కాదు అంత నీచకార్యం నే నెప్పుడూ చేయను. దేవయాని జయంతి కూతురని అందరికీ తెలిసిన విషయమే! ఆమెను చూడటానికి వెళ్ళాను."

అది దోషమని ఎవరూ అనలేకపోయారు. నహుషుడే అనలేక పోయాడు. అందుకని, "మేనకతో మీ జయంతుడి వివాహం చెయ్యటం కోసం, మవ్వే ఈ పన్నుగడ పన్ని ఉండవచ్చుగదా!" అన్నాడు.

"మేనకతో జయంతుడి వివాహం చెయ్యాలనే సంకల్పం నాకు లేదు. వారు పరస్పరం ప్రేమించుకొన్నారని తెలిసాక ఆ ప్రేమని గౌరవించాము. ఈ దేవలోకంలో ప్రేమని నిలుపుకోవటానికి వివాహాలు చేసుకోనక్కర్లేదు. కానీ, మేనక ఘంటాకర్ణుడికి బలి కాకుండా మాత్రమే ఈ వివాహం జరిపించాము."

సభ ఇంద్రాణి మాటలకు హర్షం ప్రకటించింది విషయాన్ని పరిశీలించి వివరాలు తెలుసుకొన్న దేవ వ్రాతలు, శుక్రాచార్యులను హెచ్చరించింది మాయాడని చెప్పారు. మునులు ఇంద్రాణి దోషమేమీలేదని నిర్ణయించి ఆమెను సగౌరవంగా సభనుండి పంపివేసారు. నలుగురిలో నహుషుడే మూర్ఖుడిగా నిరూపింపబడ్డాడు. ఇంద్రాణి మీద ఎంతో దోషిగా ఆరోపించాడే కాని, ఇంద్రాణిని ఏమీ చెయ్యలేక పోయాడనీ, ఏమీ చెయ్యలేడనీ, లోకులు గేలిచేసారు. "ఇంద్రాణి సభకు రానూ వచ్చింది, సగౌరవంగా వెళ్ళనూ వెళ్ళింది. ఆమెను సభకు రప్పించిన అవకీర్తి




## ఇంద్రసింహాసనం

మాత్రమే నహుషుడికి దక్కింద''ని మరి కొందరు పరిహసించారు. నహుషుడు ఉడికి పోయాడు.

ఆన గూఢచారులైన దేవదూతలనుపంపి విషయం వివరంగా తెలుసుకురమ్మనిపంపాడు. వారు హేమ మయుడికి చెప్పగా మయుడు శుక్రాచార్యులను హెచ్చరించాడని చెప్పారు. నహుషుడు వెంటనే హేమను దేవలోకానికి పిలిపించమని ఆజ్ఞాపించాడు.

హేమ అసలు దేవకన్య. ఒకలోకంలోవారు మరొక లోకానికి కార్యార్థం వెళ్ళినా, ఆ లోకంలో ఉండిపోవటానికి వీల్లేదు. వెళ్ళిన కార్యం ముగించుకొని, తమ లోకాలకు వచ్చెయ్యాలి. ఇది అన్నిలోకాలకు సంబంధించిన న్యాయసూత్రం.

రాక్షసులయినా, మయుడిమీద గౌరవంతో తమ రాజ్యంలో హేమను వుండనిచ్చారు. కానీ, దేవకన్య తమ రాజ్యంలో వుండటం వారికి ఇష్టంలేదు.

హేమను తిరిగి తమ లోకానికి రమ్మని దేవతలు వుత్తరువు పంపారు. హేమ అది కాదనటానికి వీల్లేదు. హేమ కారణంగా దేవతలతో యుద్ధం చేయటానికి రాక్షసులు సిద్ధంగాలేరు. మయుడొక్కడు ఏమీ చెయ్యలేదు. హేమ విధిలేక భర్తనూ, పిల్లలనూ వదిలి దేవలోకానికి రావలసి వచ్చింది. ఇంద్రాణి ఎంతో బాధపడింది. హేమను ఓదార్చింది. కానీ, భార్యాభర్తలను సహితం విడదీసే న్యాయసూత్రాలనుఎదిరించలేకపోయింది. ఈ లోకాలన్నీ ఎప్పుడూ దేని జాగ్రత్తలో అవి ఉంటాయి. ఇతరలోకాల వ్యక్తులు తమలోకంలో ఉన్నారంటే, వారిని వారి లోకాలకు పంపటానికే ప్రయత్నిస్తాయి. చాలా అరుదుగా ఒకలోకంలో వారు మరోలోకంలో వారిని వివాహం చేసుకోవటం జరుగుతుంది. అప్పుడు భార్యాభర్తలు కలిపి ఉండటానికి విశ్వప్రయత్నం చెయ్యాలి.

హేమను దేవలోకానికి పిలిపిస్తూనే, ఇంద్రాణి స్వర్గం వదిలి మరోలోకానికి పోకూడదని ఆంక్షలు విధించాడు నహుషుడు. దీనికి మునులు చాలా బాధపడ్డారు. ఇంద్రాణి సహజంగా యుద్ధాలకు వ్యతిరేకి. ఆమె ముల్లోకాలలోనూ సత్సంబంధాలు నెలకొల్పటానికి పాటుపడుతుందే తప్ప, కలతలు వృద్ధిచేయదు. అన్ని లోకాల నాయకులతోనూ వ్యవహరించగల శక్తి సామర్థ్యాలామెకున్నాయి. అలాంటి వ్యక్తిపైన నహుషుడు ఆంక్షలు విధించటమేమిటి? ఈ రకమైన చర్యలు మిగిలిన లోకాలలో స్వర్గానికున్న ప్రతిష్ఠను దెబ్బతీస్తాయి. మునులు నహుషుడితో ఆంక్షలు తొలగించమని చెప్పారు. ఇంద్రాణిని దోషిగా నిరూపించబడితే, ఆమెను శిక్షించవచ్చును. కాని, ఈ రకమైన ఆంక్షలు నహుషుడినే నవ్వులపాలు చేస్తాయని హెచ్చరించారు.

(ఇంకా వుంది)



# ఆంధ్రప్రదేశ్ లో
# చేనేతకు చేయూత





ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం క్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము చేనేత పని వారలకు అన్నివిధాల సహాయం అందజేస్తోంది,

శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి) సహాయ కార్యక్రమాల ప్రధాన అంశాలు: శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

* 1975-76 సంవత్సరంలో 1024 ప్రాథమిక చేనేత పనివారల సహకార సంఘాలు ఉండగా, అవి 1833కు పెరిగాయి. ఈ సంఘాలలోని సభ్యుల సంఖ్య 2.25 లక్షల నుంచి 3.40 లక్షలకు పెరిగింది.
* చెల్లించబడిన వాటా ధనం రూ. 1.26 కోట్ల నుంచి రూ. 5.56 కోట్లకు పెరిగింది. కార్య నిర్వాహక పెట్టుబడి ధనం రూ. 1.50 కోట్ల నుంచి రూ. 7.86 కోట్లకు పెరిగింది.
* వస్త్రాల ఉత్పత్తి విలువ రూ. 11.30 కోట్ల నుంచి రూ. 36.00 కోట్లకు 300 శాతం పెరిగింది.
* కొత్తగా చేపట్టిన జనతా వస్త్రాల ఉత్పత్తి 3.00 కోట్ల మీటర్ల స్థాయికి చేరుకుంది.
* ఎపెక్స్ నేత పనివారల సంఘాల వాటా ధనం రూ. 105 లక్షల నుంచి రూ. 606 లక్షలకు, కార్య నిర్వాహక పెట్టుబడి రూ. 1.95 కోట్ల నుంచి రూ. 12.50 కోట్లకు పెరిగింది.
* వస్త్రాల విక్రయాల విలువ 1975–76లో రూ. 7.75 కోట్లు వుండగా 1980-81లో రూ. 30.00 కోట్లకు పెరిగింది.
* 129 కొత్త విక్రయ కేంద్రాలు 3 కొత్త చేనేత విక్రయ శాలలు, 2 ఎగుమతి కేంద్రాలతో సహా మొత్తం 437 విక్రయ కేంద్రాలు పని చేస్తున్నాయి. వాటిలో చాలా వాటికి ప్రభుత్వ సహాయం లభిస్తోంది.
* నేతకు ముందు, ఆ తర్వాత కావలసిన ప్రాథమిక సౌకర్యాలను కూడా కల్పించారు.
* రాష్ట్ర ప్రభుత్వం రూ. 21.00 లక్షల పెట్టుబడితో 5 ఆధునిక అద్దకం యూనిట్లు, రూ. 345 లక్షల ఖర్చుతో 50,000 నుంచి 60,000 మీటర్ల నూలు దారం, దాదాపు 20,000 మిశ్రమ లేదా కృత్రిమ దారం ప్రాసెస్ చేసే శక్తిగల మూడు పోస్ట్‌లూమ్ యూనిట్లు నెలకొల్పారు.
* 4 నూలు విలువల మెర్సిరైజ్ యూనిట్లు, 6 స్క్రీన్ ప్రింటింగ్ యూనిట్లు, 2 మినీ పోస్టులూమ్ ప్రాసెసింగ్ యూనిట్లు నెలకొల్పే కొత్త పథకాలను రూపొందించారు.
* రాష్ట్రంలో జవుళి పరిశ్రమలోని ప్రభుత్వరంగ సంస్థలు, సహకార సంస్థలు విదేశాలకు రూ. 257 లక్షల విలువచేసే దుస్తులు, వస్త్రాలు ఎగుమతి చేశాయి.
* సహకార నూలు మిల్లులు దారం ఉత్పత్తిని వార్షికంగా 25,000 బేళ్లనుంచి 45,000 బేళ్లు పెంచాయి. కొత్తగా మరో 6 సహకారనూలు మిల్లులు ఏర్పాటు చేయడంద్వారా ప్రస్తుత ఉత్పత్తి స్థాయిని రెండు రెట్లు పెంచాలని ప్రతిపాదించారు.
* రాష్ట్రంలో ప్రప్రథమంగా చిత్తూరు జిల్లాలోని సత్యవేడులో సహకార రంగంలో పోలిస్టర్ దారం తయారీ యూనిట్టును ఏర్పాటు చేస్తున్నారు!
* ఉత్పత్తిని విస్తరింపజేసి, నేత పనివారలకు మరింత లాభసాటి అయిన వేతనాలను లభింపజేసే లక్ష్యంతో ప్రభుత్వ సహాయంతో రూ. 102.00 లక్షల పెట్టుబడితో మగ్గాల ఆధునికరణ కార్యక్రమాన్ని అమలు జరిపారు.
* గత 5నుంచి 6సంవత్సరాలకాలంలో ఈ పరిశ్రమకు ప్రభుత్వ సహాయం 12రెట్లు పెరిగింది. 1975–76లో చేనేత పరిశ్రమను అభివృద్ధికి ఒకకోటి రూపాయలకుతక్కువగా పెట్టుబడివుండగా 1980–81సం.లో ఈ మొత్తం 12కోట్ల రూ.లకు పెరిగింది. ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లోని చేనేత పనివారలకు ప్రభుత్వం సర్వవిధాలా గరిష్ఠ స్థాయిలో తోడ్పాటు, సహాయం అందజేస్తోంది

సమాచార, పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము D.I.P.R. No. 17420 Advt/C1-3/81

## అవీ—ఇవీ—అన్నీ

### కాకినాడలో సిహెచ్. నారాయణరావుకి సన్మానం

కాకినాడ యంగ్ మెన్స్ హేపీ క్లబ్ వారు ఆంధ్ర నాటక రంగ, బళ్లారి రాఘవ శత జయంత్యుత్సవాల సందర్భంగా ఒకనాటి మహా నటుడు శ్రీ సిహెచ్. నారాయణరావును ఇటీవల ఘనంగా సన్మానించారు. తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత తెలియజేస్తూ, శ్రీ నారాయణరావు ఇలా అన్నారు. "1940లో అనుకోకుండా జీవనజ్యోతి చిత్రంలో నటించటం ద్వారా చిత్ర రంగంలో ప్రవేశించాను. ఆ చిత్రం విడుదలై నన్ను 'నవజ్యోతి నారాయణరావు'ను చేసింది. "స్వర్గసీమ" "లక్ష్మమ్మ" "మేనరికం" "మనదేశం" "ముగ్గురు మరాటీలు" "తాసిల్దారు" "పేరంటాలు" "జీవి



తం", ఆదిజన్మ వంటి ఎన్నో చిత్రాలలో నటించాను. అప్పట్లో అంటే నాకు నటనని గురించి పెద్దగా తెలియని రోజుల్లో పరిశ్రమ నన్నాదరించింది. కొంత ప్రాబల్యం సంపాదించాక విధి నన్ను చిత్ర పరిశ్రమకు దూరం చేసింది. ఇందుకు నేనెవరినీ నిందించను కాల ప్రభావం అని సరిపెట్టుకుంటాను. అతే ఈ ప్రాంతాలకు వచ్చినప్పుడల్లా మిత్రులూ అభిమానులూ ఇటీవల మీరు చిత్రాలలో కనిపించడం లేదు గదా జీవితం ఎలా నడుస్తున్నది -అని అడుగుతూ ఉంటారు. వారికి నేను ఒకటే సమాధానం చెబుతూ ఉంటాను. "ఇదివరలో తినాలని ఉన్నప్పుడల్లా అన్నం తినేవాణ్ణి. ఇప్పుడు అన్నం దొరికినప్పుడు తింటున్నాను".

యంగ్ మెన్స్ హేపీ క్లబ్ వారు శ్రీ నారాయణరావును దుశ్శాలువలతోనూ, సువర్ణ పతకంతోనూ సన్మానించారు.


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

# రుచులొలికే పానీయం చిటికెలో తయార్!

చింత లేదు,
బెడద లేదు...

ఒక జగ్ నిండుగా నీటిలో ట్రింకా ప్యాకెట్‌లోని పొడరును పూర్తిగా వేయండి. తగినంత చక్కెరను కలపండి. బాగా కదపండి. క్షణంలో 5 గ్లాసుల ట్రింకా తయార్! రుచికరమైనది. ఆధునికమైనది. ఎంతో పొదుపైనది.

ఆఫీసు నుండి అలసి ఇంటికి రాగానే అబ్బో ఎంత మజా!

నారింజ, నిమ్మ, అనాస ఈ మూడూ నాకిష్టమైన రుచులే!

ట్రింకా

ట్రింకా

TRINKA
from the makers of REX
Drink Mix
Flavour Orange
makes 5 glasses
ADD SUGAR TO TASTE
Mfd by:
CORN PRODUCTS CO. (INDIA) LTD.
28 H. Somani Marg, Bombay 400 001

ట్రింకా

ప్రపంచంలో అందరికీ ఇది ఎంతో ప్రీతికరం. మీకు తెలుసుగా!

ఇంత రుచికరమైన పానీయం మును పెన్నడూ సేవించలేదు!

ట్రింకా

రసమయ ఉల్లాసాన్నిచ్చే క్రొత్త విధానం.

ట్రింకా

REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి REX రెక్స్ ఉత్పాదకుల నుండి